

రంభ-నాట్యభంగిమ (బేలూరు)

ఫొటో : శ్రీ. గోపాలకృష్ణన్—మద్రాసు.




ఆరాధన

చిత్రకారుడు: పి. నరేంద్ర—మద్రాసు

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 50
సంచిక 41
13.6-56

దుర్ముఖ జ్యేష్ఠ శుద్ధ పంచమి బుధవారం

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : "చదువులరాణి"

చిత్రకారుడు : మంత్రినాది వేంకటరామయ్య.



### గమనిక.

ఆంధ్రపత్రిక న్యూఢిల్లీ ప్రతినిధి శ్రీ శ్రీకృష్ణ అమెరికా, యూరప్ దేశాలలో పర్యటనకై వెళ్లారు. కనుక కొన్ని వారాల పాటు న్యూఢిల్లీ లేఖ ఆపివేస్తున్నాము. తిరిగి ఆయన రాకతో ఆ శీర్షిక యథాప్రకారం ప్రకటిస్తాము.

# ★ తుది వీడుకోలు ★

ఉపావణుని కా విషయం అంతా తెలియజేశాడు. ఉపావణుడా వార్తవిని ఒక్క పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు. దానితో అతని హృదయం బాగా తేలికపడింది.

అంతలో ఆనందుని నేత్రాలు తిరిగీ తారకల వైపు తిరిగాయి. అతడొక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టి ఆ పక్కనున్న వారికి కూడా వినబడీ వినబడనట్టుగా— "ద్వితీయ యామంకూడా గడిచిపోయింది!" అన్నాడు. ఆ మాట వినగానే భిక్షుసంఘం దృష్టులన్నీ సాలవృక్ష లతానికుంజ మధ్యప్రదేశంలో పర్ణపుష్పశయ్యపై పవళించిన బుద్ధదేవుని ముఖంవైపు ప్రసరించాయి.

౨

ఆకాశంలో తారకలన్నీ నిశ్చలనేత్రాలతో అదృశ్యమే తిలకిస్తున్నట్టు మెరిశాయి మూడో యామంకూడా కొంతవరకు గడిచిపోయింది. అంతలో సుభద్రుడనే భిక్షువు ఆనందుని సమీపానికి వచ్చి నిలుచున్నాడు. ఆనందు డతనిని చూచి చాలాకాలమైంది. సుభద్రుడు దూరప్రయాణం చేసి బాగా అలసిపోయి ఉన్నాడు. ఆనందుడతనిని బాగా పరిశీలనగా చూచి నిర్ఘాంతపోయి మెల్లిగా ఇలా అడిగాడు.

"సుభద్రా! ఎక్కడినుంచి ఈ రాక!"

"నైశాలినించి!"

"తథాగతులను సందర్శించడానికేనా?"

"అవును! అందుకోసమే మున్ముందుగా తమసన్నిధికి వచ్చాను."

"అయ్యో! వేళ మించిపోయింది. నాయనా! తథాగతుల పరినిర్వాణ సమయానికిక ఒక రెండుగడియలు మాత్రమే అవధి!"

"అర్హతదేవా! నాకది తెలియకపోలేదు! ఈ దీనుని కింతవరకు తథాగతుల ముఖతః ధర్మదీక్ష స్వీకరించే భాగ్యం కలగలేదు! ఆ మహోద్భవం కలిగించవలసిందని అర్థించడానికే మీ సన్నిధికి వచ్చాను! నా కీవరం అనుగ్రహించండి!"

"ఈ చివరిక్షణంలో కూడా వారికి శ్రమ కలిగించడం ధర్మం కాదు నాయనా! మహాభినిష్క్రమణక్షణంనుంచీ ఈ క్షణందాకా ఆయన అహోరాత్రాలు నిద్రాహారాలు లేకుండా మన అందరిమీద అపార కరుణామృతం వర్షించారు ఇటీవల అస్వస్థులై చిక్కి శల్యమై పోయారు. ఇప్పుడొక్క క్షణంపాటు ప్రశాంతంగా మౌనముద్ర వహించారు! నామాటవిను నాయనా! వారికి మానభంగం కలిగించటం న్యాయం కాదు!"

కాని సుభద్రుడు తనపట్టు విడవలేదు. అలాగే అతి దీనస్వరంతో కాళ్ళావేళ్ళా పడి ప్రతిమాలడం మొదలు పెట్టాడు.

అంతలో ఒక అరగడియ గడిచిపోయింది. ఇంక మిగిలిన దొక అరగడియ మాత్రమే! సుభద్రు డిక లాభంలేదని చాపచుట్టగా ఆనందుని కాళ్ళమీద పడ్డాడు. ఆనందుడు తన కంఠస్వరం బాగా తగ్గించి—

"నాయనా! సుభద్రా! నన్నిక నిర్బంధించకు! ఏమైనా సరే! నీవీసమయంలో తథాగతులను సందర్శించడానికి వీలు లేదు!" అన్నాడు.

సుభద్రుడొక క్షణకాలం నిశ్చలంగా ఎంతో జాలిగా ఆనందునివైపు చూచి గద్గదస్వరంతో ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు.

"అర్హతా! శతకోటి జన్మలకైనా నాకిక స్వయంగా తథాగతుల సన్నిధిని ధర్మదీక్ష స్వీకరించే మహాభాగ్యం కలగదుగదా!"

"అవును! సుభద్రా! నాకిది తెలియకపోలేదు! అయితే సమయం మించిపోయిన తరవాత మనమేమి చెయ్యగలం చెప్పు! నాయనా!"

"అంతేనా? మీకీ దీనునిపై మరి కరుణ కలగదా!"

"కరుణింపవలసినవారా సమ్యక్సంబుద్ధులు గాని నేనెంతవాణ్ణి సుభద్రా!"

"ఈ క్షణంలో కరుణించి అనుమతించవలసినవారిక మీరేగదా!"

"కావచ్చును! కాని వేళమించిపోయింది! నాయనా!"

ఆమాట వినగానే సుభద్రుని ముఖం వివర్ణమై వెలవెలబోయింది. గొంతు తడి ఆరిపోయింది. తిరిగీ ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు.

అంతలో సాలవృక్షాల నడుమనుంచి అమృతమాధుర్యంతో నిండిన ఒక పిలుపొకటి వినబడింది. గౌతమబుద్ధుడు క్షీణస్వరంతో మెల్లిగా "ఆనందా!" అని పిలిచాడు.

ఆనందుడా పిలుపు వింటూనే ఒక్క అంగలో బుద్ధదేవుని శయ్యాసమీపానికి వెళ్ళి నిలుచున్నాడు.

"ఆనందా! ఆ వచ్చినవారెవరు?"

"ఉపాసక సుభద్రుడు. స్వయంగా మీ ముఖతః ధర్మదీక్ష స్వీకరించవలెననీ, దర్శనం ఇప్పించవలసినదనీ నిర్బంధిస్తున్నాడు. అయితే ఇది సముచితసమయం కాదని—"

"అయ్యో! అలాగా! నాయనా! వెంటనే లోపలికి తోడుకురాలేకపోయినావా! ఎంతపని చేశావు! తొందరగా లోపలికి తోడుకురా!"

ఆనందుడు గురుదేవుని ఆజ్ఞ వింటూనే వెంటనే సుభద్రుని నక్కడికి తీసుకువచ్చాడు. తరవాత వారిద్దరినీ అక్కడవిడిచి లతానికుంజద్వారంలో నిలబడ్డాడు అయితే అతని నేత్రాలు రెండూ గౌతమదేవునివైపే తిలకిస్తున్నాయి.

అప్పుడే ఉదయించిన చంద్రవంక వెలుగులో సాలతరువనం అంతా అలినిదొక చల్లని



# తథాగత నిర్వాణం

చిత్రకారుడు: వశిక రామలింగేశ్వరరావు.

పాలవెల్లిలా స్ఫురించింది. చిరునవ్వులు చిలకరిస్తూ ఆచార్యదేవుడు సుభద్రునిపైపెంతో ఆప్యాయంగా చూస్తున్నాడు. మధ్య మధ్యన చల్లనిమాటలతో అతని కష్టాంగ ధర్మదీక్ష అనుగ్రహిస్తున్నాడు. క్రమక్రమంగా ఆచార్యదేవుని చిరునవ్వులు వెన్నెల వెలుగులలో కలిసిపోతున్నాయి.

సుభద్రుడు ధర్మదీక్ష స్వీకరించి తిరిగి నికుంజద్వారందగ్గరికి వచ్చాడు. అతని ముఖంలో ఒక్కనిమేషంవరకు ఆనంద సాగరం తాండవించింది!

ఆనందునిపాదాలకు మోకరిల్లి "అర్హతా! మీదయవల్లనే నాకు సాక్షాత్తుగా తథాగతుల ముఖతః ధర్మదీక్ష స్వీకరించే మహాభాగ్యం కలిగింది! ఇక నాజన్మ తరించింది! అయితే ఈ తుదిగడియలో కూడా ఆకరుణామూర్తినీ, మిమ్మల్నీ ఎంతైనా శ్రమపెట్టాను. నన్ను మన్నించండి!" అన్నాడు. అతనిముఖం అంతా కన్నీటితో తడిసిపోయింది. అనంతరం సుభద్రుడు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ భిక్షుసంఘంలో ప్రవేశించాడు. తదేకదృష్టితో తథాగతుని ముఖంవైపే తిలకిస్తూ నిలుచున్నాడు.

ఆసమయంలో ఆనందునికి గౌతమదేవుని అపార కరుణాస్వరూపం అంతా ఒక్కమారుగా మూర్తీభవించినట్లయింది!

బుద్ధదేవు డిటీవల కలిగిన అస్వాస్థ్యం వల్ల ఊపిరి కూడా విడవలేనంతగా చిక్కి శల్యమైపోయాడు. తుది గడియలో ఒక్కక్షణంపాటు ప్రశాంతి మౌనముద్ర వహించి పద్మ పుష్పశయ్యపై విశ్రమింపవలెనని సంకల్పించాడు. అవిఘ్నంగా రెండు యామాల కాలం గడిచిపోయింది. అంతలోనే సుభద్రుడు వక్కడికి వచ్చాడు. ఆనందు డిక ఆచార్యదేవునికి శ్రమ కలిగించడం భావ్యం కాదని అనుకున్నాడు. అయినా ఆ చరమక్షణంలో కూడా సుభద్రుని కెంతో ఆప్యాయంగా ధర్మదీక్ష అనుగ్రహించాడు. ఆసమయంలో ఆ ముఖంలో కొంచెమైనా అలసట గాని, విసుగుదల గాని జాడచూపలేదు. ఎంతటి శిష్యవాత్సల్యము! ఎంతటి మహాకరుణ! జీవచైతన్యంలో తొణికిసలాడే ఆ మహా కృపామూర్తి స్మితజ్యోతి తిరిగీ ఈ భూతలంపై మెరయదుకదా!

అవిఘ్నంగా అక్షణంలో ఆనందుని హృదయంలో ఎన్నెన్నో ఆర్ద్రభావపరంపర ఉద్భవించాయి. ఆనందు డొకసారి ఆచార్యదేవుని సన్నిధికి వెళ్ళి ఆయనపాదాలొకసారి స్పృశింపవలెనని అనుకొన్నాడు. కాని దానివల్ల గౌతమదేవుని విశ్రాంతికి భంగం కలగగలదేమోనని భయం వేసింది. అందువల్ల వెంటనే ఆ సంకల్పం విరమించాడు.

(56-వ పేజీ చూడండి)

డిటెక్టివ్ సీరియల్

మూలం: ఎడ్గార్ వాలస్

# అరుణ వలయం

అనువాదం

## 15. దొంగలతో థాలియా

ఆ సాయంత్రం థాలియా అందరికంటె ఆఖరున బ్యాంకినుండి బయలుదేరింది. మెట్లమీద కొంతసేపు ఊరికే నుంచుని అటూ ఇటూ చూసింది. రోడ్డు అవతలివైపు నుంచి తనకేసి చూస్తున్న వ్యక్తిని ఆమె చూసిందో లేదోగాని, చూసినట్టు తెలియనీయలేదు. వీధిలో కొంతదూరంఅవతల తనకోసం ఎదురుచూస్తున్న మిలీ ఆమెకంట బడింది. వెంటనే అటు నడిచింది.

"డ్రమండ్! ఇంతాలస్యం చేశావేం? నా స్నేహితుడు నీకోసం ఎదురుచూస్తున్నాడు. ఇలాఆలస్యంకావటంఅతనికి ఇష్టంఉండదు" అంది మిలీ

"క్రమంగా ఇష్టం అవుతుందిలే. మగవాళ్లకోసం వెనుకపరిగెత్తడం నాకలవాటు లేదు."

ఇద్దరూ ఒక పందగజాలు నడిచి రీజెర్ వీథిలోకి తిరిగారు. ఈ వీథిలో రెస్టరాంటులన్నీ ఫ్రెంచి పేర్లు తగిలించుకున్నాయి. "మాలాగ్రిస్" అనే రెస్టరాంటులోకి వీరు ప్రవేశించారు. అది చిన్నదిగా వున్నా అద్దాలు వగైరా హంగులతో అట్టహాసంగా కనబడుతోంది.

యువతులిద్దరూ మెట్లెక్కి పై అంతస్థులోకి వెళ్ళారు.

ఒకచోట ఒంటరిగా కూర్చున్న యువకుడు వీరిని చూడగానే లేచినుంచున్నాడు. మంచిదుస్తులు వేసుకుని, హుషారుగా కనిపించాడు.

"కూర్చో, కూర్చో, మిస్ డ్రమండ్!" అని ఆహ్వానించి, వెయిటర్ను పిలిచి టీ తెమ్మన్నాడు.

"ఈమె పేరే థాలియా డ్రమండ్!" అని మిలీ పరిచయం చేసింది.

యువకుడు నవ్వుతూ "పరిచయం చెయ్యనక్కర్లేదు. నీగురించి చాలావిన్నాను మిస్ డ్రమండ్! నా పేరు బార్నెట్" అన్నాడు.

"హలో బార్నెట్!" అన్నది థాలియా. బార్నెట్ ఆశ్చర్యపడ్డాడు.

"నన్నుగూర్చి విన్నావా?"

"ఆమెకు తెలియనిదిలేదు," అన్నది మిలీ "అంతేగాదు ఆమెకు మార్ల్నుగూర్చికూడా తెలుసు. అతనివాళ ఈమెను భోజనానికి పిలిచాడు.

బార్నెట్ యువతులిరువురినీ నిశిత దృక్కులతో చూశాడు.

"ఆమెతో నువ్వేమన్నా చెప్పావా?" అని తీవ్రంగా అడిగాడు.

మిలీ నిర్లక్ష్యంగా జవాబిచ్చింది:

"ఆమెకు ఎవరూ ఏమీ చెప్పనవసరం లేదు. ఆమెకన్నీ తెలుసు."

"నువ్వు చెప్పావా అని అడుగుతున్నాను"

"మార్ల్నుగురించా? నువ్వే చెబుతావు గదా అని నేను చెప్పలేదు."

వెయిటర్ టీ తెచ్చిపెట్టాడు. వాడు వెళ్లిపోయేవరకూ మౌనం వహించారు. [illegible] బార్నెట్ తిరిగి సంభాషణ ప్రారంభించాడు.

"మనందరం ఇప్పుడు స్నేహితులం. వ్యవహారం మాట్లాడడానికి నిన్ను పిలిచాను. నేను చిన్న చిన్న దొంగతనాలు చేసుకుని పొట్టపోసుకునే మనిషిని కాను. బాగా లాభం వచ్చేపనైతే ఎంత పెట్టుబడిఅయినా పెట్టగల మనుషులు నాకు అండగా ఉన్నారు. థాలియా! నువ్వు మంచి అవకాశాలన్నీ పాడుచేస్తున్నావు"

"అహా? అలాగా? తెలియదే! ఎలా పాడుచేస్తున్నానో?"

"ఇదిగో అమ్మాయ్!" అని బార్నెట్ ఆమెను సంబోధించాడు. "నువ్వు కవర్లలోంచి డబ్బు దొంగిలించి కాగితం ముక్కలు పెట్టి, ఎన్నాళ్ళు కాలక్షేపం చేద్దామనుకుంటున్నావు? ఆ దొంగతనం టపా బట్వాడాలోనే జరిగి వుంటుందని నా స్నేహితుడు బ్రబజాన్ అనుకుంటున్నాడు, లేకపోతే ఈపాటికి నువ్వు మళ్ళీ జైలులో ఉండేదానివి. బ్రబజాన్ నా స్నేహితుడు అని ఊరికే అనలేదు. తెలుసా?"

బార్నెట్ ఆగాడు అనవసరంగా వాగుతున్నాననుకున్నాడేమో. థాలియా ఏదన్నా అంటే ఇంకా వాగేవాడేగాని, థాలియా మౌనం వహించింది.

"ఒక విషయం చెబుతాను విను మిస్ డ్రమండ్! నేనూ, మిలీ ఒక పథకం వేశాము డబ్బు సంపాదించే పథకమే. అయితే బ్రబజాన్ బ్యాంకినుంచి కాదు. బ్రబజాన్ నా స్నేహితుడు. బ్యాంకిలో బాగా డబ్బు నిలవచేసినవాడు మార్ల్."

"నువ్వు పొరపాటు పడుతున్నావు. మార్ల్కు అక్కడ పద్దేమీ లేదు," అన్నది థాలియా.

బార్నెట్ ఆమెకేసి అనుమానంగా చూశాడు. తరవాత మిలీమాక్‌రాయ్ కేసి తీవ్రంగా చూశాడు.

"దగ్గిర దగ్గిరగా లక్ష పౌనులున్నాయన్నావుగా?"

"అవును" అన్నది మిలీ. థాలియా అందుకుని "అవును. ఇవ్వాల్టి దాకా ఉండేది. కాని ఇవ్వాళే బ్రబజాన్ అతని అకౌంటు మూసివేశాడు," అని చెప్పింది.

"నిన్ను మార్ల్ భోజనానికి పిలిచాడని బ్రబజాన్కు తెలుసా?" అని మిలీ ప్రశ్నించింది.

థాలియాతల అడ్డంగా తిప్పింది.

"మార్ల్ అకౌంటులో చాలా డబ్బుండేదా?" బార్నెట్ అడిగాడు.

"అరవై రెండు వేలు."

"అదంతా మార్ల్ ఇంట్లోనే ఉంచవన్నమాట! విన్నావా మిలీ!" అని థాలియాకేసి తిరిగి "నువ్వివాళ అతనితో కలిసి భోజనానికి వెళుతున్నావు కూడాను. ఇంకేం, బాగానే ఉంది" అన్నాడు.

"ఏమిటి బాగుంది?"

"మళ్ళీ ఇలాంటి అవకాశం జీవితంలో రాదు. మార్ల్కి ముగ్గురు నౌకర్లు ఉన్నారు. కాని మార్ల్ రాత్రిపూట ఏ స్త్రీతోనైనా గడపవలసివస్తే, ఆ రాత్రికి నౌకర్లు ఇంట్లో ఉండరు. వాళ్ళని అతను పంపించివేస్తాడు."

"కాని నేను భోజనం చేసేది మార్ల్ ఇంట్లో కాదు" థాలియా అన్నది.

"నాటకానికి కూడా రమ్మన్నాడుగా. తరవాత ఇంటికి వెడదాం రమ్మంటాడు. నువ్వు ఒప్పుకుంటావనుకో. అప్పుడు ఇంట్లో నౌకర్లెవరూ ఉండరు. నాకు మార్లో అలవాట్లు బాగా తెలుసు."

"అయితే ఏం చెయ్యమంటావు?" థాలియా అడిగింది. "తుపాకి గురిపెట్టి డబ్బు దోచుకోమంటావా?"

"అదికాదు నా ఉద్దేశం. నువ్వు ఏం చేయనక్కర్లేదు. అతని ఇంటికి వెళ్ళి ఆతిథ్యం స్వీకరించి నీ దోవన వెళ్ళిపోవడమే. కొంచెం అతిగాణ్ణి నవ్వించి కవ్వించి వదిలెయ్. అతను అఘాయిత్యం తలపెడతాడేమోనని భయపడకు. నేను కూడా ఆ యింట్లోనే దాగి ఉంటాను. ఏదన్నా జరిగితే నేను అడ్డుపడతాను," అని చెప్పాడు బార్నెట్.

థాలియా తలవంచుకుని చెంచాను చేతుల్లో పట్టుకుని తిప్పుతోంది "అతడు నౌకర్లను పంపించివేయకపోతే?" అని అడిగింది.

"ఆ విషయంలో నీ కనుమానం అనవసరం. ఇంతకంటె మంచి అవకాశం దస్తే దొరకదు."

థాలియా అంగీకరించలేదు.

"ఏమో ఇదంతా నాకు అయోమయంగా ఉంది. నువ్వు చెప్పినట్లు నేను చిక్కుల్లో పడవచ్చుగాని, చిన్న చిన్న దొంగతనాలంటేనే నాకు ఇష్టం."

"ఏడిపిస్తుంది" బార్నెట్ విసుక్కున్నాడు. "బోలెడు డబ్బు ఒక్కసారిగా వచ్చిపడుతుంటే ఊహూ, అనటం ఏమిటి? నీమీద పోలీసుల నిఘా లేదు. నామాదిరిగా నువ్వు అందరికీ తెలిసిన దానివిగాదు. ఏమిటి నీ అభ్యంతరం?"

థాలియా కొంచెసేపు తలవాల్చి ఆలోచించింది. "సరే అలాగే చేస్తాను," అని అంగీకరించింది.

థాలియా రెస్టారెంటునుంచి బయలుదేరి గృహోన్ముఖంగా నడిచింది. తను పనిచేసే బ్యాంకి మీదుగానే దారి. ఆ ప్రాంతం దాటిపోయిన తరవాతగాని టాక్సీని పిలవడాని కామె మనస్కరించలేదు. బ్రబజాన్ మాస్ ఏమైనా అనుమానపడవచ్చు. రీజెంట్ వీధిలోని జనప్రవాహంలో కలిసి ఆమె నడిచిపోతున్నది ఇంతలో ఆమె భుజంమీద ఎవరిదో చెయ్యిపడింది. ఉలికిపడి వెనుదిరిగి చూసింది.

"థాలియా!"

"జాక్ బియార్ మాక్!" ఆమె గొంతు కొంచెం వణికింది. జాక్ ముఖం ఎర్రబడింది.

"నీతో ఒక్క ముక్క మాట్లాడిపోవాలని వచ్చాను. ఈ అవకాశం కోసం వారం రోజుల్నించి చూస్తున్నాను," అని త్వరితంగా అన్నాడు.

"నేను బ్రబజాన్స్ బ్యాంకిలో పనిచేస్తున్నానని నీకు తెలుసా? ఎవరు చెప్పారు?"

జాక్ సందేహించాడు.

"ఇన్‌స్పెక్టర్ పార్ చెప్పాడు." థాలియా పెదవులపై చిరునవ్వు వికసించింది. అది చూసి "పార్ అంత చెడ్డవాడేం కాదు. నిన్ను గురించి అతడింకేమీ చెప్పలేదు కూడాను," అన్నాడు.

"చెప్పినా చెప్పకపోయినా నాకేం భయంలేదు. సరేగాని నేను వెళ్ళాలి. తొందర పని ఉంది" అన్నది థాలియా.

జాక్ ఆమె చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

"థాలియా! ఆపని ఎందుకు చేశావో చెప్పవూ? నిన్నెవరు ప్రోత్సహించారో చెప్పవూ?"

ఆమె మందహాసం చేసింది.

"ఈమాదిరి మనుషులతో నువ్వు సంచరించడానికేదో కారణం ఉండాలి. చెప్పవూ?"

"ఏమాదిరి మనుషులతో?" థాలియా ప్రశ్నించింది.

"నువ్వు ఆ రెస్టరాంటులోంచి రావడం చూశాను. ఫ్లష్ బార్నెట్ అనే వ్యక్తి పచ్చి దొంగ. మిలీమాక్ రాయ్ అతని తోడు దొంగ. ఈఇద్దరూ జైలులో ఉండి వచ్చినవాళ్ళే."

"అయితే?" థాలియా అడిగింది.

"వాళ్ళని గూర్చి నీకు తెలిసే వాళ్ళతో తిరుగుతున్నావా?"

"నీకెలా తెలిసింది వాళ్ళని గూర్చి?

ఎన్నెందుకిలా వేటాడుతున్నావు? నువ్వూ, హార్ కలిసి నన్ను వెంబడిస్తున్నారా?" అని థాలియా నిర్భయంగా అడిగింది.

జాక్ ఈమాటలకు నిర్ఘాంతపోయాడు.

"థాలియా! నువ్వు చాలా తెలివైన దానివి. నీలాంటి యువతి అనీచులతో కలిసి తిరగడం దేనికి? నీ విషయంలో నేను జోక్యం చేసుకోకూడదుగాని, నీకు చేతనైన సహాయం చెయ్యాలని ఉంది. వాళ్ల పికిలిలో నువ్వు ఉండిపోడానికి కారణమైన పని ఏదైనా నువ్వు చేసి ఉంటే నేను నిన్ను తప్పించగలను."

ఆమె 'గుడ్ బై' చెప్పి తొందరగా వెళ్లిపోయింది. అతడు తెల్లం మొహం వేసుకుని నిలబడి పోయాడు.

ఆమె పికాడిలీ వరకూ నడిచి అక్కడొక టాక్సీ ఎక్కింది. మేరిబోన్‌రోడ్‌లో ఆమె కొత్తగా అద్దెకు తీసుకున్న బసకు వెళ్ళింది. మూడో అంతస్తులో ఉన్న తన గదికి లిఫ్టు ఎక్కి చేరింది. ఆమె గది అందంగా అలంకరించబడి ఉంది. బెల్ నొక్కగానే ఒక్క స్త్రీ వచ్చింది. ఏడున్నరకి ఐదునిమిషాలుందనగా తనకొక కారు అవసరమనీ, ఆ సమయానికి ఒక కారు సిద్ధంగా ఉండమనీ ఆమెకు ఆజ్ఞాపించింది.

మిస్ డ్రమండ్ జీతం వారానికి నాలుగు పౌన్లు మాత్రమే!

## 16. మార్ల్ హత్య

"ఓ, వచ్చావే! ఆహా! ఎంత అందంగా ఉన్నావు! అద్భుతంగా ఉన్నావు!" అంటూ ఫెలిక్స్‌మార్ల్ థాలియాను ఆహ్వానించాడు.

ఆమె రెండుచేతులూ తన చేతుల్లోకి తీసుకుని లోపలికి తీసుకువెళ్ళాడు.

"చాలా బాగున్నావు. నిన్ను అసలు రిట్జ్ కార్ల్‌టన్‌కు, తీసుకెళ్ళడానికి అనుమానించాను. కాని నా అనుమానం పటాపంచలు చేశావు. సిగరెట్ కావాలా?" మార్ల్ అడిగాడు.

సిగరెట్ తీసుకుని వెలిగించి "నేను ఏదో చవకబారు దుస్తులు వేసుకుని వస్తాననుకున్నారా?" అని థాలియా అడిగింది.

"అవును. అలాగే అనుకున్నాను. ఇదివరకు చాలసార్లు అనుభవమైంది," అంటూ మార్ల్ పడకకుర్చీలో కూలబడ్డాడు.

"అయితే అందమైన యువతులను ఆహ్వానించడం మీకు అలవాటేనన్నమాట," థాలియా మరొక కుర్చీలో కూర్చుని అర్ధనిమీలిత నేత్రాలతో అతనికేసి చూస్తూ అడిగింది.

"నేను స్త్రీలపై విముఖతకలిగే వయస్సులో లేనే. అయినా, నువ్వు అపూర్వంగా, అద్వితీయంగా ఉన్నావు."

ఫెలిక్స్‌మార్ల్ కూడా అందంగా తయారయి ఉన్నాడు. కాని అతని వాలకమంతా అనుమానించ దగినదిగానే ఉంది.

"ముందు భోజనానికి వెళదాము. తరవాత నాటకానికి వెళదాము. ఆ తరవాత" మార్ల్ కొంచెం సంకోచిస్తూ "మళ్ళీ కాస్త ఏదన్నా తిందాము" అన్నాడు.

"నాకు అప్పుడు ఆకలికాదు," అని థాలియా జవాబిచ్చింది.

"పోనీ, కాసిని ఫలాలు తినవచ్చు."

"అప్పటికి రెస్టరాంటులన్నీ కట్టివేస్తారు గదా!"

"ఎందుకూ, ఇక్కడికే వచ్చి ఫలహారం కానిద్దాం. ఆ తరవాత నిన్ను నా కారులో నీ బసకు తీసుకువెళతాను."

"అక్కర్లేదు. నేనొక కారు తెచ్చాను."

మార్ల్ ఆమె కారు తెచ్చుకున్నదని విని ఆశ్చర్యపడ్డాడు. తరువాత అట్టహాసంగా నవ్వాడు. "అసాధ్యురాలివే మొత్తానికి," అన్నాడు.

నాటకం అయినతరవాత వారిద్దరూ తిరిగి వచ్చారు. ఆమె లోపలికి రావడానికి సంకోచించింది. కాని ఆమె సందేహాలన్నిటినీ మార్ల్ తన వాగ్ధాటితో చెదరగొట్టేశాడు. రాత్రి పదకొండున్నర అయింది. మార్ల్ నౌకర్లనెవర్నీ పిలవలేదు. తనే భోజన పదార్థాలన్నీ బల్లమీద అమర్చుతున్నాడు.

"నేనిప్పుడేమీ తినలేను. ఇంటికి వెళ్ళిపోతాను." థాలియా అంది.

"ఆగు అప్పుడేనా? నీతో మీ యజమాని గూర్చి మాట్లాడాలి. నీకు ఆ బ్యాంకిలో ఏ సహాయం కావాలన్నా నేను చేయించగలను" అంటూ మార్ల్ ఆమె కుర్చీవెనకగా ఉన్న భోజనపుపళ్లెం తీసుకోవడానికి వచ్చాడు. అక్కడిదాకా వచ్చి ఆమెమీదికి వంగాడు. ఆమె అతనిపట్టు తప్పించుకోక పోతే ముద్దు పెట్టుకు నేవాడే.

"ఇక నేను వెళ్లిపోతాను" థాలియామళ్లీ అన్నది.

"మరేంఫరవాలేదు. కూర్చో."

ఆమె పాలోచనగా అతనికేసి చాలసేపు చూసింది. హఠాత్తుగా వెనక్కి అడుగువేసి తలుపుదగ్గిరికి వెళ్లి తెరవబోయింది. కాని తలుపుతాళం వేసివుంది.

"తలుపు తెరవడం మంచిదనుకుంటాను మిస్టర్ మార్ల్!" అని తొణుకు బెణుకు లేని నిశ్చలస్వరంతో థాలియా అడిగింది.

"ఉహు. అదేంకుదరదు. థాలియా! నువ్వు మంచిదానివిగదూ! నామాటవిని ఇలారా" అని మార్ల్ ఇకిలించాడు.

"నేను మంచిదాన్నని నీ అభిప్రాయమన్నమాట. ఆ అభిప్రాయం చెడగొట్టడం నా కిష్టంలేదు. తలుపు తెరుస్తావా లేదా?" అని థాలియా రెట్టించింది.

"తప్పకుండా."

మార్ల్ లేచాడు. జేబులో తాళంచెవి తీయడంకోసమన్నట్టుగా చెయ్యిపెట్టుకుని తలుపుదగ్గిరగా వచ్చాడు. థాలియా ఏమరుపాటుగా ఉన్న ఆ క్షణంలోనే అతడు ఆమెమీద పడ్డాడు చేతులతో ఆమెను బంధించాడు. మార్ల్ బలిష్ఠంగా ఉన్నాడు. ఆమెకంటె చాలా పొడుగు. అతని చేతులు ఉక్కు పటకార్లలాగా ఆమెను నలిపివేశాయి.

"వదిలిపెట్టు" అని థాలియా ఇంకా నిశ్చలంగానే అన్నది. ఆమె భయపడిన సూచన ఎక్కడా కానరాలేదు.

ఆమె మెత్తబడుతున్నట్లు అతడు గ్రహించాడు. జయించానని భావించాడు.

ఆయాసంగా ఊపిరి పీలుస్తూ ఆమెను వదిలి పెట్టాడు.

"అయితే, ముందు ఏమన్నా తింటాను" థాలియా అలా అనడం అతనికి కొండెక్కినంతపనైంది.

"అదీ, అలా ఉండాలి మంచిపిల్ల అంటే. నేను చెప్పలా నువ్వు మంచిదానివని... ఏమిటది?" మార్ల్ ఇల్లెగిరేట్లు అరిచాడు.

థాలియా నెమ్మదిగా బల్లవద్దకు వెళ్ళి తన చేతిసంచీ తెరిచింది. ఆమె రుమాల కోసం సంచీ తీస్తోందని మార్ భావించాడు. కాని రుమాల బదులు పిస్తోలు బయటికి వచ్చింది

"దాచేసెయ్. అదెందుకు? తీసెయ్" మార్ల్ అరిచాడు.

"ముందు తలుపు తియ్యి" థాలియా శాంత స్వరంతో అన్నది.

నిలువునా కంపిస్తూ మార్ల్ తాళం తీసి తలుపు తెరిచాడు.

ఆమె వెళ్ళిపోగానే మార్ల్ తలుపు వేసుకుని, ఇంకా వణుకుతూనే మెట్లెక్కి పడక గదిలోకి వెళ్ళిపోయాడు.

ఫ్లిప్ బార్నెట్ ఒకమూల చీకట్లో నక్కి ఉన్నాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. మార్ల్ గదిలోంచి ఏ విధమైన శబ్దం బయటికి రావడం లేదు. గది పైగా కిటికీలోంచి కొద్దిగా వెలుతురు మాత్రం బయటికి కనిపిస్తోంది.

బార్నెట్ నెమ్మదిగా పిల్లిలాగ పాకుతూ తలుపువద్దకు వెళ్ళి చెవి ఒగ్గి విన్నాడు. లోపల మార్ల్ తనలో తాను మాట్లాడుకుంటున్నట్లు వినిపించింది అతడేం చేస్తున్నాడో చూడాలనిపించింది నడవలో ఒక బల్ల ఉన్నది. అది తీసుకువచ్చి పైన ఎత్తుగా ఉన్న కిటికీవద్ద పెట్టి, ఎక్కి చూశాడు. మార్ల్ చాలా ఆందోళనతో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. ఇంతలో బార్నెట్‌కు ఏదో శబ్దం వినిపించింది ఎవరో తివాచీ మీద నడుస్తున్న అలికిడి అయింది బల్ల దిగి మెట్లవరకూ నడిచాడు కింద హాలంతా చీకటిగా ఉంది మెట్లమీద ఎవరో నుంచున్నట్లు, కనిపించలేదు గాని అనిపించింది. మగవాడో. స్త్రీయో తెలియలేదు. తెలుసుకోవడానికి అతడు ఆగలేదు. బార్నెట్ నడవ అవతలి చివరకు వెళ్ళిపోయి, అక్కడ పొంచి, చూశాడు. కాని ఎవరూ పైకి రాలేదు మళ్లీ బార్నెట్ పాకుకుంటూ వచ్చాడు. మార్ గదితలుపు బలవంతాన తెరిచినా లాభం లేదని ఊరుకున్నాడు.

అతడిదివరకే ఇల్లంతా ఒకసారి పరీక్షించాడు. అందుచేత లైబ్రరిగదిలో ఉన్న ఇనపపెట్టెను తెరిచి చూడడం మంచిదని నిశ్చయించుకున్నాడు.

ఇనపపెట్టె తెరిచి సుమారు రెండుగంటల సేపు అంతా వెదికాడు. అయితే అతడు ఆశించిన పెద్ద మొత్తమేమీ దొరకలేదు. అప్పటికి రాత్రి చాలా అయిపోయింది. ఇక అక్కడ తచ్చాడడం మంచిది కాదనుకున్నాడు దొరికినదంతా కలిపి ఒక చిన్న మూటకట్టి జేబులో వేసుకున్నాడు. మెట్లెక్కి పైకి వెళ్లాడు. మార్ల్ గది నిశ్శబ్దంగా ఉంది. దీపం వెలుగుమాత్రం ఇంకా ఉంది.

మెట్లు దిగి కిందికి వెళ్లాడు. హాలులోంచి వెళ్ళి ఒకచోట విడిచిన తన బూట్లు, ఓవర్ కోటు, టోపీ తీసుకున్నాడు. తరవాత దొడ్డివైపు తలుపు తీసుకుని, బయటి ఆవరణలోకి వచ్చాడు. తోటగేటు తెరిచి బయటికి వెళ్లబోతున్నాడు. ఇంతలో ఎవరో అతన్ని తాకారు. బార్నెట్ గిరుక్కున వెనక్కి తిరిగాడు.

"ఫ్లిప్! నీతో మాట్లాడాలి. నేను ఇన్‌స్పెక్టర్ పార్‌ని, జ్ఞాపకం ఉందా?" అని ఒక కంఠం వినిపించింది.

"పార్!" అని బార్నెట్ విభ్రాంతుడైనాడు. వెంటనే అతని పట్టు విడిపించుకుని గేటులోంచి దూసుకుని పారిపోయాడు. కాని బయట అతనికోసం కాచుకుని ఉన్న ముగ్గురు పోలీసులు అతన్ని పట్టుకున్నారు. వారతన్ని దగ్గర్లో ఉన్న పోలీసు స్టేషనుకు నడిపించుకుపోయారు.

ఈలోగా పార్ తన అన్వేషణ తాను సాగించాడు. ఒకడిటెక్టివును సహాయంకోసం వెంటపెట్టుకుని హాలులో ప్రవేశించాడు. మెట్లెక్కి మార్ల్ గదివద్దకు వెళ్లాడు.

"ఈ ఒక్క గదిలో తప్ప ఇంకెక్కడా ఎవరూ లేరల్లే ఉంది," అంటూ తలుపు తట్టాడు.

సమాధానం లేదు.

"నువ్వు వెళ్ళి నౌకర్లనెవరినయినా లేపు", అని పార్ ఆజ్ఞాపించాడు. అతని సహాయకుడు ఇల్లంతా తిరిగివచ్చి ఎక్కడా నౌకర్లు లేరని చెప్పాడు.

"ఇక్కడెవరో ఉన్నారే" అంటూ టార్చిలైటు వేసి నడవలో చూశాడు. అక్కడ బల్ల కనిపించింది. ఒక్క ఉదుటున దానిమీదికి లంఘించి పైనున్న కిటికీలోంచి. గదిలోకి దృష్టి సారించాడు.

"ఎవరో నిద్రపోతున్నారు. ఏయ్. లే. నిన్నే. ఏయ్", అని అరిచాడు. కాని జవాబు రాలేదు.

(56-వ పేజీ చూడండి)

# మనజాతికి జాతకచక్రం

అఖిల భారత కాంగ్రెసుసంఘ సమావేశాలు జూన్ 2, 3, తేదీలలో బొంబాయి సిద్ధార్థనగర్‌లో జరిగాయి. జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను ఈ సభలో చర్చించి వివిధ తీర్మానాలు చేశారు.

దేశంలో కానవస్తున్న దౌర్జన్యప్రవృత్తులను, ప్రాంతీయ దురభిమానాలను ప్రధాని శ్రీ నెహ్రూ నిశితంగా విమర్శించారు. అనేకుల కొద్దీ మానవులు దానవులుగా ప్రవర్తించడం అతినీచం, మనదేశం పేరు ప్రతిష్ఠలకు భంగకరము అని ఆయన అన్నారు. ఈ ధోరణిని అణచివేయడానికి కాంగ్రెసు వెనుకాడదని స్పష్టపరిచారు. ఈ లక్షణాలు దేశానికి శ్రేయస్కరమైనవి కావన్నారు.

రెండవ పంచవర్ష ప్రణాళికను, శ్రీ నెహ్రూ 'మనజాతికి జాతక చక్రం' వంటిదని అభివర్ణించారు. "మన బుద్ధులు, దుర్బుద్ధులు, దీక్ష, పట్టుదల, ఐక్యత, అనైక్యత, ఆత్మవిశ్వాసం వంటివే ఈ చక్రంలో గ్రహాలు. ఇవే మన ప్రణాళిక ఫలాలను చూపేవి, ఇచ్చేవి." అని శ్రీ నెహ్రూ అన్నారు. సోషలిస్టు సమాజ స్థాపన లక్ష్యం సంగతి ప్రస్తావిస్తూ, తీర్మానాలు, కరతాళ ధ్వనులు, అపైన శాసనాలు చేసినంత మాత్రాన, పరిశ్రమలను జాతీయం చేసినంత మాత్రాన ఈ లక్ష్యం సిద్ధించదన్నారు. దేశాభ్యున్నతికి అవసరమైన వస్తు సంపదనంతా మనదేశంలోనే సమృద్ధిగా ఉత్పత్తి చేసుకోగలగాలి. ఇక, దేశాభివృద్ధికి ఆటంకాలుగా ఉన్న వాటిలో ముఖ్యమైనది. రూపాయనోట్లు హెచ్చుగా అచ్చుకొట్టడం కాదు. అప్రతిష్ఠాకరమైన దౌర్జన్యపద్ధతులే అని ప్రధాని చెప్పారు.

పంచవర్ష ప్రణాళిక ద్వారా దేశాభివృద్ధి లక్ష్యసాధనకు ప్రజలంతా సహకరించాలని



## జర్మనీ జాతీయ క్రీడ

ఒకసారి లండన్‌లో జరిగిన ఒక ఫుట్‌బాల్ పోటీలో ఇంగ్లాండు జర్మనీని 3-1 గోలులతో ఓడించింది. ఆ తరువాత ఒక విందు జరిగింది. అక్కడ ఇంగ్లాండ్ జట్టు నాయకుడు బిలీ రైట్‌తో జర్మన్ జట్టు ప్రతినిధి మాట్లాడుతూ, "ఫుట్‌బాల్ మా జాతీయ క్రీడ ఇందులో కనక మేము మిమ్మల్ని ఓడించి ఉంటే, అద్భుతంగా ఉండేది మాకు మంచి పేరూ వచ్చేది." అన్నాడట.

బిల్లీ రైట్ ఒక్క క్షణం ఆలోచించి "అయితే కావచ్చు కాని, 'మీ జాతీయ క్రీడ'లో మాత్రం మాదేశం మిమ్మల్ని రెండుసార్లు ఓడించింది. తెలుసుగా" అన్నాడు.

(బిల్లీ రైట్ రెండు పోటీ లనడంలో ప్రపంచ యుద్ధాల సంగతి స్మరించాడని చెప్పక్కరలేదు.)



భారత ఆకాశవాణిశాఖ ఢిల్లీ తాల్‌కటోరావనంలో ఏర్పాటుచేసిన వేసవి నాటకోత్సవాల్లో- భాసుని "స్వప్నవాసవదత్తము", (హిందీ అనువాదం) మే 28 నుంచి 31 దాకా ప్రతి రోజూ ప్రదర్శించారు. అందులో ఒక దృశ్యం.




దశాంశ పద్ధతి క్రింద భారత ప్రభుత్వం జారీచేయనున్న కొత్తనాణాలు. ఒక్కొక నాణెంపైవున్న అంకె నయాపైసలలో దాని విలువ తెలుపుతుంది. మధ్య వరుసలో వున్నది రూపాయినాణెం; దానిముందు వెనుకల స్వరూపం.

విజ్ఞప్తి చేస్తూ సభవారు ఒక తీర్మానం చేశారు. రాష్ట్రాలలో అల్పసంఖ్యాక వర్గాల రక్షణకై ఫజులాలీ సంఘం సూచించిన ఆరు సూత్రాలనూ కూడా ఆమోదించారు. గోవా పట్ల పోర్చుగల్ వైఖరిని ఖండించి, గోవా జాతీయ కాంగ్రెసు వాదుల ఉద్యమాన్ని బలపరుస్తూ తీర్మానించారు. కాశ్మీరు భారతదేశ అంతర్భాగమని కాశ్మీరు రాజ్యాంగ పరిషత్సభ చేసిన నిర్ణయానికి తిరుగులేదని స్పష్టపరుస్తూ మరో తీర్మానం చేశారు. మనిలా, బాగ్దాదు కూటాలు ఇందులో జోక్యం చేసుకోవడాన్ని నిరసించారు. ★

# నయా పైసా

పదిపళ్ళ ఖరీదు రూపాయి అయితే ఒక పండు ఖరీదెంత?

ఇది 1956 జూన్ నెల. ఇప్పుడైతే రెండు మూడు నిముషాలు తిప్పలుపడితే, ఒకపండు వెల ఒకఅణా, ఏడూ రెండూ పై పదివమ్మిడీలని చెప్పగలం. ఏడాది తిరిగి మళ్ళా జూన్ తిరిగివచ్చేనాటికి పండువెల పది పైసాలని చప్పున చెప్పవచ్చు.

విదేశాలతో ద్రవ్యమారకం వ్యవహారాలు సులభం కావడానికి వర్తక వాణిజ్యాలలో వడ్డీలూ, బారువడ్డీల లగాయతు లాభనష్టాలూ, జమాఖర్చులు మొదలైనవన్నీ సులభంగానూ, త్వరత్వరగానూ లెక్కకట్టడానికి వీలుగా మనప్రభుత్వం ఈ కొత్తపద్ధతిలో రూపాయలూ, అర్ధలూ పావలాలూ



# నయా పైసా



పైసాలుగా తయారుచేస్తున్నారు. ఈ కొత్త నాణాల లెక్కలకి పదో ఎక్కం చాలు. ఎక్కాలు రాని చిన్న పిల్లలకి, మర్చిపోయిన పెద్దపిల్లలకికూడా ఇది సంతోషం కలిగిస్తుంది.

ప్రపంచం మొత్తంమీద నాణాలు అమలులో ఉన్న దేశాలు 140 వరకు ఉన్నాయి. వాటిలో 105 దేశాలలో దశాంశపద్ధతి నాణాలు చెలామణీలో ఉన్నాయి.

రూపాయని నూరు భాగాలు చేసే ఈ కొత్తపద్ధతి 1957 ఏప్రిల్ 1వ తేదీన అమలులోకి వస్తోంది. రూపాయల నోట్లన్నీ మామూలుగానే ఉంటాయి. వచ్చే మార్పల్లా చిల్లరడబ్బులదగ్గరే. ఈ మార్పు చెయ్యాలన్న ఆలోచన 90 ఏళ్లక్రితం బయల్దేరింది.

ఈనాటికి తెమిలింది. దమ్మిడీలు అనేవాటికి ఇంకపైన అసలు చోటుఉండదు. రూపాయకి నూరు పైసాలు ఇస్తారన్నమాట. ఇపుడు మనకి అర్థణా, అణా, బేడ పావలా, అర్థరూపాయ కాసులు వున్నాయి. కొత్తపైసా లెఖ్ఖప్రకారం అర్థణా, అణా, బేడకాసులు పోతాయి. ఒక పైసా కాసు, రెండు పైసాలకాసు, తరవాత ఐదు ఆపైన పదిపైసాల బిళ్ల, తయారుచేస్తారు. తరువాతది పావలా. దానికి ఆ పేరే ఉంటుందికాని, దానిమీద నూరింట నాలుగోవంతు 25 పైసాలు అని అచ్చు కొడతారు. తరువాతది 50 పైసాలకాసు అంటే అర్థరూపాయన్నమాట. ఆఖరున రూపాయబిళ్ల ఉంటుంది ఇవే దశాంశపద్ధతి నాణాలు. ఇప్పుడు చెలామణీలో ఉన్న మూడు దమ్మిడీల నాణెం 'కానీ'ని పైసా అని చాలామంది వ్యవహరిస్తారు. ఇది రూపాయిలో అరవైనాలుగో వంతు. దీనికి ఇప్పుడు కొత్త లెక్కప్రకారం రూపాయలో నూరోవంతుగా రాబోయే నాణానికి తేడా తెలియడంకోసం ఈ కొత్త నాణానికి "నయాపైసా" (కొత్తపైసా) అని పేరు పెట్టారు. దానిమీద అలాగనే వ్రాస్తారు. ఈ నాణాలకు అందరూ బాగా అలవాటుపడ్డాక ఈ 'నయా' అనే బిరుదుని తీసేసి పైసా అని మాత్రమే ఉంచుతారు. దీనికి మూడేళ్లు పడుతుందనుకొంటున్నారు.

1957 ఏప్రిల్ 1న ఖజానానుంచి వచ్చేవి ఒక పైసా, రెండు పైసాలు, ఐదు, పది పైసా నాణాలు మాత్రమే. పావలా (25 పైసాలు) అర్థరూపాయ (50) విలువలో మార్పేమీ ఉండదు కాబట్టి వాటిని కొన్నాళ్లు అలాగే ఉంచుతారు.

కొత్తనాణాలకు 'బొమ్మ' వైపున అశోక స్తంభం ఉంటుంది. దానికి ఒకపక్కని 'భారత్' అని దేవనాగరి లిపిలోను, మరో పక్క 'ఇండియా' అని ఇంగ్లీషులోనూ వ్రాస్తారు. 'బొరుసు' వైపున ఆయా నాణాలు రూపాయలో ఎన్నోవంతో వ్రాస్తారు. దానికి ఎన్ని పైసాలో అంకె వేస్తారు. పావలా ఉందనుకోండి దానిమీద 'రూపాయలో నాలుగోవంతు' (రుప్యే కా సవా భాగ్) అని వ్రాస్తారు. 25 అని పెద్ద అంకె వేసి దానిక్రింద 'నయా పైసే' అని వ్రాస్తారు.

నయాపైసా కాసుని కంచుతో తయారు చేస్తారు. రెండు, ఐదు, పది పైసా కాసుల్ని రాగినికెల్ కలిపి తయారుచేస్తారు, 25 పైసాల (పావలా) 50 పైసాల (అర్థ రూపాయి) కాసుల్ని, రూపాయ బిళ్లను, కల్తీలేని నికెల్ లోహంతో తయారుచేస్తారు.

ఇంక, ఇప్పుడున్న అర్థణా, అణా, బేడలకు ఈ నయాపైసా లెక్కప్రకారం విలువ ఒకంతట తేలదు కాబట్టి వాటి స్థానంలో కొత్తగా ఒక పైసా, రెండు, ఐదు, పది పైసా కాసుల్ని ప్రవేశపెడతారన్నమాట.

తొంభై ఏళ్లనాడు తలపెట్టిన ఈ కార్యం ఈనాటికి ఆచరణలోకి వస్తోంది. ఇప్పటికైనా, ఇదేమీ ఆలస్యం అనుకోనక్కరలేదు. మనదేశం పారిశ్రామిక, వాణిజ్యరంగాలలో ఇప్పుడే అభివృద్ధి చెందుతోంది. లెక్కలు కట్టేయంత్రాలు, మొదలైనవి. ఇంకా నాణాలు ముద్రించే యంత్రాలు విరివిగా తయారు కావటం లేదు: ఇదే ఇంకొక పదిహేనేళ్ల తరువాత అమలు జరిపి ఉంటే, ఈ తరహా యంత్రాలన్నీ, కొత్తవి తయారుచేసుకోవడం తదనుగుణమైన మార్పులు అనేకం ప్రవేశపెట్టడం అవసరమయ్యేవి. ఇపుడు ఆ అనవసరశ్రమ, ఖర్చు కూడా తప్పాయి.

ఈపద్ధతి చాలామంచిదని గుర్తించినా, అమలు జరపని దేశాలలో బ్రిటన్ ఒకటి. దానికి కారణం ఈ లెక్కలు కట్టే యంత్రాలు పౌను షిల్లింగులు పెన్నీల లెక్కలకి వీలుగా భారీఎత్తున తయారై ఉండడమే. మనకి మాత్రం, కొత్తపద్ధతి అవలంబించడానికి బొత్తిగా అంత జాప్యం కాలేదు. నిజానికి ఇదే సరియైన తరుణం. ద్రవ్యమానంలాగే కొలమానంలోనూ తులామానంలో కూడా క్లిష్టమైన ఇప్పటి పద్ధతులు తొలగించి, సులువైన దశాంశ పద్ధతిని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం నిశ్చయించింది. వచ్చే 15 ఏళ్ళలో ఈ కార్యక్రమాన్ని దశలవారీగా అమలు జరుపుతారు






# 23

నాటకం ప్రారంభమైంది. ఇతరులు కాని, ఇతర ప్రపంచం కాని ఏమీ లేదు— అపూ, వాడి ఎదురుగా నీలమణి హాజా జట్టు మాత్రమే ఉన్నది! సంజె పడబోయే ముందు వాయులీనం మీద 'యమున కల్యాణి' ఆలపించాడు. అతడు చాలా ఘటికుడైన వాయులీన విద్వాంసుడు. పల్లెటూరి కుర్రవాళ్లు ఇంత చక్కని వాద్యాన్ని ఇదివరకెన్నడూ విని యెరుగరు. ఉదాసకరుణ స్వనం ఉన్నటుండి హృదయాన్ని ఎక్కడికో తీసుకువెడ్తుంది.... నాన్న వసారాలో కూర్చుని ఇంకా యేదో రాసుకుంటూనే ఉండి ఉంటాడు...అక్క వద్దామని ఉబలాటపడినా రాలేకపోయింది. జరీదుస్తులు ధరించి, గ్యాసులైట్లు వ్రేలాడుతున్న సభాస్థలికి రాజు, మంత్రులు రావటం ప్రారంభం కాగానే—ఇలాంటిది నాన్నకి చూడటానికి లేకపోయింది కదా అని అనిపించింది. ఊళ్లోవాళ్లందరూ వచ్చారు. తమ వీథిలో రానివాళ్లంటూ లేర్లు. నాన్న ఇంకా ఎందుకని...? నాటకం సాగిపోతోంది గబగబా. ఇదివరకు ఇక్కడి పిల్లలంతా ఈ నాటకం వెయ్యటం చూశాడు అపూ, కాని అదక్కడ! ఇదెక్కడ! ఈ దుస్తులు! ఈ రంగులు! ఈ మొహాలు...!

"సరిగ్గా కనపడుతున్నదిట్రా నీకు?" అని హఠాత్తుగా వెనకనుంచి అడిగా రెవరో! వాళ్లనాన్న యెప్పుడొచ్చి వెనకాల కూర్చున్నాడో—అపూ యెరుగడు. "నాన్నా! అక్క వచ్చిందా? నాకా లడ్డుంకట్టిన చోట—ఆడవాళ్ల చోటులో కూర్చుం దనుకుంటా..." అన్నాడు.

'మంత్రి కుట్ర మూలంగా రాజు రాజ్యాన్ని కోల్పోయి, భార్య పిల్లలతో అడవికి వెడుతున్నప్పుడు వాయులీనంమీద విషాదగీతం వినిపించింది. రాజు అప్పుడిహాకరుణరసం ఉట్టిపడేట్లు ఒప్పించేందుకు, భార్య, పిల్లల చేతులు పట్టుకుని ఒకొక్క అడుగే వేస్తూ ఆగటం మొదలెట్టాడు. మళ్లీ మరో అడుగు ముందుకు వేసేవాడు. వాస్తవ జగత్తులో నిజంగా అరణ్యాలకు బయలుదేరిన రాజు కేవలం మతి సరిగ్గా లేకపోతే తప్ప ఇంతమంది యెదుట ఇలా నడవడు.' నమ్మిన బంటు అయిన సేనానాయకుడు కోపంతో—మూర్ఛరోగికంటె అన్యాయంగా వణకటం మొదలెట్టాడు. అపూ రెప్పవాల్పకుండా తన్మయుడై చూస్తూ విస్తుపోతున్నాడు. ఇలాంటిది వాడెన్నడూ చూసి ఎరుగడు.

తర్వాత రాజు ఎక్కడికి వెళ్లాడో, రాణీ ఎక్కడికి వెళ్లిందో ... కారడవిలో రాజకుమారుడు అజయుడు, రాజకుమార్తె ఇందులేఖ—ఇద్దరూ తిరుగుతున్నారు. వాళ్ల మొహం చూసేవాళ్లెవరూ లేరు. దారి చూపిస్తూ వెంటపెట్టుకు వెళ్లేవాళ్లూ లేరు. తమ్ముడికి పళ్లు ఏమైనా తీసుకువద్దామని కొంచెం దూరం వెళ్లిన ఇందులేఖ తిరిగిరాలేదు. అజయుడు అక్కకోసం అడవి అంతా వెతుకుతూ తిరుగుతున్నాడు. తర్వాత హఠాత్తుగా పడివున్న అక్క శవం కంటపడింది— ఆకలికి ఆగలేక ఏ విషఫలమో తినేసరికి చచ్చిపోయింది. తర్వాత అజయుని ఏడుపు పాట! ... 'ఎటకేగితో ప్రియ సోదరీ!' అంటూ...ఇంతవరకూ తన్మయుడై అలాగే చూస్తున్నాడు అపూ. ఇంక అపుకోలేక వెక్కి వెక్కి ఏడ్వటం మొదలెట్టాడు.

కళింగరాజు విచిత్రకేతుల కత్తియుద్ధం ఎంత అద్భుతంగా ఉంది! పోతాయి. వ్రేలాడుతున్న లైట్లు పప్పు-పప్పు అయిపోతాయి లేదా దగ్గరగావున్న ఏదౌర్భాగ్య ప్రేక్షకుడి కళ్లయినా ఎగిరిపోతాయని 'లైట్లు జాగ్రత్త, లైట్లు జాగ్రత!' అని కేకలు బయలుదేరాయి. కాని అద్భుతం ఆ యుద్ధకౌశలం! ఏమీపోలేదు. ఎలావున్న! అలానే వున్నాయి అన్నీ! సెబాష్ విచిత్రకేతూ!...

మధ్యలో హార్మోనిస్టు, తబలిస్టు, వంత పాటగాళ్లు కలిసి చాలాసేపు పాటల, దరువుల కుస్తీపట్టారు. ఆ సమయంలో తండ్రి అపూని పిలిచి, 'నిద్రవస్తోందా? యింటికి పోదామా?' అని అడిగాడు. నిద్రా! వెధవ నిద్ర! ఏమయినాసరే ఇంటికి వెళ్లదల్చుకోలేదు అపూ. తండ్రి బయటికి పిలిచి, "ఈ అర్ధణా దగ్గిర పెట్టుకో. ఏమన్నా కొనుక్కుని తిను, నేను ఇంటికి వెడుతున్నాను" అని చెప్పి, అర్ధణా ఇచ్చివెళ్ళాడు. ఒక కానీ పెట్టి తమలపాకుబీడా కొనుక్కుని వేసుకుందామనిపించింది వాడికి. ఆ దుకాణం దగ్గిర జనం గుమిగూడి ఉంటని చూసి, దగ్గరకు వెళ్లి చూసి నిర్ఘాంతపోయాడు. సేనాపతి, విచిత్రకేతు.

అతడిచుట్టూ రథోత్సవంలో మూగినట్లు మూగారు జనం. ఇది మరీ ఆశ్చర్యం! రాజకుమారుడు అజయుడు ఎక్కడినుంచో వచ్చి, విచిత్రకేతు భుజంమీద చెయ్యివేసి, "ఒక కానీపెట్టి తమలపాకుబీడా కొనిపెట్టవ్ కిశోర్ దా?" అని అడుగుతున్నాడు. రాజకుమారునిమీద సేనాపతికి భక్తివిశ్వాసాలున్నట్లు నిదర్శనాలేవీ కన్పించటంలేదు. ఆ చెయ్యి విదిలించి, పారేసి, "ఫో, నేనేం డబ్బులు పోగు వేసుకుని కూర్చోలేదు. అప్పుడు

**జరిగిన కథ:—**

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తరవాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, పదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలఏళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లలకిదేం పట్టింది? దుర్గకి ఒక్కనిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీవింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కనిపిస్తుంది. ఒకరోజున అపూను బళ్లోవేశారు. చదువుచెప్పడంకంటె, బడిలోనే ఒకపక్కనఉన్న చిల్లరకొట్టుపని చూసుకోవడం, కొట్టుకు వచ్చేపోయేవారితో కబుర్లుచెప్పడమే పంతులుగారికి అలవాటైంది. కొట్లోకివచ్చే గ్రామస్థుల కబుర్లు వింటూ అపూ ఏవో ఆలోచనల్లో తేలిపోతూ ఉండేవాడు. పంతులు ఎప్పుడైనా పాఠంచెప్పినా ఆ మాటలు వాడికి అర్థంఅయ్యేవికావు. అర్థంకాని ఆ శబ్దసముదాయం వెనక వాడికి ఏవో చిత్రవిచిత్రమైన రమణీయలోకాలు, దేశకాలబాధితంకాని ప్రపంచాలు కనిపించేవి. పెద్దవాడైన తరవాత దారికనుక్కుని అక్కడికి వెళ్ళాలని వాడు నిశ్చయించుకున్నాడు. దుర్గకి మంచిసంబంధం ఏదన్నా చెయ్యాలని తల్లి ఆవేదన. అన్ని బీదసంసారాల్లో లాగానే, ఈ సంసారంలోకూడా ప్రతివాళ్ళూ ఎప్పుడో ఏదో అదృష్టం కలిసివచ్చి తమను ఉద్ధరిస్తుందని ఆశపడేవారు. కాని ఆ అదృష్టం అనేది ఎప్పుడూ వారికి ఎడం ఎడంగానే ఉంటూవచ్చింది.

 **పథేర్ పాంచాలి** 

పబ్బు మీరిద్దరూ గుద్దుకుంటూ నవ్వేస్తున్నారు?" అని అడిగాడు. "కొనిపెట్టవూ కిశోర్ దా? నీకు నేనెప్పుడూ ఏమీ పెట్టలేదూ?" అన్నాడు మళ్ళీ రాజకుమారుడు. విచిత్రకేతు చెయ్యి విదిలించుకుని వెళ్ళిపోయాడు.

అపూ యీడే ఉంటుంది. చక్కగా చూడముచ్చటగా ఉంటాడు. చక్కటి గొంతుకూడాను. అపూ ముగ్ధుడై ఆ కుర్రవాడికేసి చూస్తూ నుంచున్నాడు. పల్కరించుదామని మహా అనిపిస్తోంది. చటుక్కున ఏ ఆకర్షణవల్లనో సాహసించి ముందుకువచ్చాడు. కొంచెం సిగ్గుపడుతూ "తమలపాకుబీడా వేసుకుంటావా?" అని అడిగాడు. అజయుడు కొంచెం విస్తుపోయాడు. "నువ్వుకొనిపెడతావా? ఏదీ తెచ్చిపెట్టు మరి!" అన్నాడు, ఇద్దరికీ స్నేహమయింది. స్నేహం అనటం పొరపాటు. అపూ ముగ్ధుడు, తన్మయుడూ అయినాడు. ఈ రాజపుత్రుడైన అజయుణ్ణే తానిన్నాళ్లనుంచీ భావనావీథిలో పరికిస్తూవచ్చాడు. తనతల్లి చెప్పిన వందలకొలది కథలద్వారా, చిన్నప్పటి కలలన్నీ ముచ్చటగా రూపకల్పన చెయ్యటంతో—వాడిప్రాణం ఈ మూర్తిని చూడటానికి తహతహపడుతోంది—ఈ రూపు, ఈ కళ్లు, ఈ ముఖం, ఈ కంఠమే! సరిగ్గా తాను కోరుకున్నటే! "మీ యిల్లెక్కడ తమ్ముడూ? నాకు ఎవరింట్లోనో భోజనం ఏర్పాటుచేశారు. వాళ్ళింట్లో భోజనాలు ప్రొద్దుపోతూంటాయి. మీ యింట్లో ఎవరు భోంచేస్తున్నారు?" అని అడిగాడు అజయుడు.

సంతోషంతో అపూ ఒళ్లు గరిపొడిచింది. "మాయింటికి భోజనానికి వచ్చిన అతడు ఇవాళిక్కడ తబలా వాయిస్తున్నాడు భాయీ! రేపటినుంచి నువ్వు రా, నేను వచ్చి పిలుచుకుని వెడతాను. ఆ తబలావాయించే అతడు నువ్విదివరకు భోంచేస్తున్న ఇంటికి వెడతాడులే" అన్నాడు.

ఇద్దరూ కాసేపు అటూఇటూ తిరిగాక "నేను వెడతానికా తమ్ముడూ! చివరి సీనులో నా పాట ఒకటి ఉంది. నా పార్టు ఎలాఉంది నీకు?" అని అడిగాడు అజయుడు.

తెల్లవారకట్ల నాటకం అయిపోయాక అపూ ఇంటికి వచ్చాడు. ఇంటికి వచ్చాక "నాటకం ఎలాఉందిరా అపూ?" అని అడిగింది వాళ్ళ అక్క.

నిర్మానుష్యంగా ఉన్న కీకారణ్యంలో రాజకుమారి ఇందులేఖ ఏమన్నదో గుర్తుకు వచ్చింది వాడికి. ఏదో మైకం క్రమ్మినట్లుంది వాడికి. పట్టలేని సంతోషంతో— "రేపట్నుంచీ అజయుడివేషం వేశాడే ఆ అబ్బాయి మన ఇంటికి భోజనానికి వస్తాడు అమ్మా!" అని చెప్పాడు.

"ఇద్దరూ వస్తారా? ఇద్దరికీ ఎక్కడనుంచి-?" అన్నది తల్లి.

"అహహఁ, కాదు. ఒకడు వెళ్లిపోతాడు. అజయుడు మాత్రమే వస్తాడు" అన్నాడు అపూ.

"ఎలాంటి నాటకంరా అపూ! ఇలాంటిది యెప్పుడూ చూడలేదు. ఆ రాజకుమార్తె వచ్చిపోయినపుడు పాడినపాట ఎంత బాగుందిరా?" అన్నది దుర్గ. రాత్రి నిద్రలో ఎక్కడినుంచో నాటకంలో పాటలు వినిపిస్తున్నట్లు అలాపనగానే ఉంది వాడికి. తెల్లవారి కొంచెం ప్రొద్దెక్కాక మెలకువ వచ్చింది వాడికి. తెల్లవారుఝామున పట్టింది నిద్ర. అంత మంచినిద్ర పట్టలేదు. చురుకు మరుక్కున ఎండ కళ్లలోకివచ్చి పొడుస్తోంది. కళ్లు మంటపుట్టి నీళ్ళుకారాయి. కాని వాడిచెవుల్లో యింకా ఆ నాటక సంగీతం వినిపిస్తున్నట్టే ఉంది—ఇంకా నాటకందగ్గర కూర్చుని ఉన్నట్లు. నీలాటిరేవుకి పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ నడుస్తున్న ఆడవాళ్ళను చూస్తూంటే వారిలో ఒకామె ధీరావతిగాను, మరో

కాళిదాస కళింగదేశ శ్రీ మహారాణిగాను, ఇంకొక ఆమె రాజకుమారుడు అజయుని తల్లి వసుమతి గాను అపూ మనసుకి తోచింది. అక్క మాటాడే ప్రతిమాటలోనూ, కాళ్లూ చేతుల కదలికల్లోనూ రాజకుమార్తె ఇందు లేఖ రూపురేఖలు అచ్చుగుద్దినట్లు కన్పించ సాగాయి. నిన్న ఇందులేఖ వేషం వేసు కున్న వారు తనకు బాగానే నచ్చారు కాని, రాజకుమార్తె ఇందులేఖ తన ఊహ ప్రకారం అచ్చగా అక్కలాగా అంతంత కళ్లు, అంత అందమైన ముఖం, అలాంటి తలకట్టు, అలాంటి రంగూ కలదే అయివుంటుంది.

ఇందులేఖ తన సౌజన్య మధురిమతో ఆ కాలంలో అప్పుడు అలా జీవయాత్ర ముగించాక—మళ్ళీ ఇప్పుడు తన అక్క రూపంలో ఇలా పుట్టి ఉంటుంది అంచేత నే నిన్న ఇందులేఖ మాటల్లో, నడకల్లో అక్క రూపు అలా కొట్టవచ్చినట్లు కన్పించింది. కారడవిలో ఆ రాజపుత్రి ఎంతో అపేక్షతో తమ్ముణ్ణి కావిలించుకుని కూర్చున్నప్పుడు, వాడికి పళ్లు తెచ్చి పెడదామని ఒంటరిగా వెళ్ళి అడవిలో దారితప్పిపోయినప్పుడు అపూ మనస్సుకి అక్క 'మాకాల్ పండు' కోసం వెళ్ళిననాటి సంఘటన చటుక్కున స్ఫురించింది.

మధ్యాహ్నం అపూనెళ్ళి అజయుణ్ణి భోజనానికి పిలుచుకువచ్చాడు. వాళ్లమ్మ ఇద్దరికీ ఒక పంక్తినే అన్నంపెట్టి, అజయుడ్ని గురించిన భోగట్టా తెలుసుకోవటం మొదలెట్టింది. అతడు బ్రాహ్మణ కుర్రవాడు. అతడికి 'నా' అన్న వాళ్లెవరూ లేరు. వేలువిడిచిన ఒక పింతలి పెంచింది. ఆమెకూడా పోయింది. ఏడాదినుంచి ఆ భాగోతులతో కలిసి తిరుగుతున్నాడు. సర్వజయకి ఆ కుర్రవాడిమీద చాలా అపేక్ష పుట్టుకొచ్చింది. వద్దన్న కొద్దీ వడ్డించి, బలవంతంచేసి తినిపించింది. పదార్థాలు ఆట్టే మేమీ లేకపోయినా, ఆ కుర్రవాడెంతో తృప్తిగా భోంచేశాడు. తర్వాత దుర్గ "అమ్మ! నిన్న నాటకంలో వాళ్ళ అక్క తప్పిపోయినప్పుడు పాడినపాట పాడమనవ్ ఓసారి!" అని తల్లి చెవిలో ఊదింది.

అజయుడు గొంతు సవరించుకుని పాడాడు. అపూ ముగ్ధుడైపోయాడు. సర్వజయకు కళ్లు చెమ్మగిలాయి. పాపం! తల్లి లేని పిల్లవాడు! తర్వాత ఆ కుర్రవాడు ఎరోక పాట పాడాడు. "సాయంత్రం వేలాలు చేస్తాను. నువ్వు తప్పకుండా వచ్చి తిని వెళ్లు నాయనా. సిగ్గుపడబోకు నీ యిష్టం వచ్చినప్పుడల్లా ఇక్కడికి వస్తూ పోతూ ఉండు - మా స్వంతయిల్లులాగా నే- ఏం?" అన్నది సర్వజయ.

 # పథేర్ పాంచాలి 

అపూ అతడ్ని వెంటపెట్టుకుని ఏటిఒడ్డుకు తీసుకెళ్లాడు. అక్కడ అజయుడు "తమ్ముడూ, నీది చాలా తియ్యని కంఠంలా ఉంది. ఒక పాట ఏదైనా పాడరాదూ?" అని అడిగాడు. అతని ముందు పాడి, తన గొప్ప వెల్లడించుకోవాలని అపూ చాలా అభిలాషపడ్డాడు. కాని మళ్లీ నాటకాల్లో వేషాలువేసే అంతటి వాడిదగ్గర తాను పాడటమా, అని భయంకూడా వేసింది. ఏటి ఒడ్డున బూరుగు చెట్లక్రింద, కోలిబాటకి కొస్తదూరంగా, వెదురు గుబురు చాటుకుపోయి కూర్చున్నారిద్దరూ. అపూ ఎలా అయితే యేం సిగ్గును త్రోసివేసుకుని ఒక పాట పాడాడు - అది దాశరాయ్ గేయ సంపుటిలోది - తండ్రి పాడుతూంటే తాను విని రాసుకున్నది. అజయుడు విస్తుపోయాడు.

"నీదింత మంచి కంఠం, నువ్వెప్పుడూ ఏదీ పాడవు ఎంచేత తమ్ముడూ? ఏదీ ఇంకొకటి పాడు" అన్నాడు. అపూ ఉబ్బిపోయి ఇంకొకటి అందుకున్నాడు. అది వాళ్లక్క ఎక్కడో నేర్చుకువచ్చి పాడుతూండేది. ఆ ఫణితి బాగుండడంవల్ల దాన్ని అక్క దగ్గర నేర్చుకున్నాడు. ఇంట్లో యెవరూ లేనప్పుడు-అప్పుడప్పుడు- వాళ్ళిద్దరూ కలిసి పాడుతూ ఉంటారా పాట.

పాట పూర్తిఅవగానే అజయుడు అపూని తెగపొగడాడు. "ఇంచక్కని కంఠం ఉన్నవాడివి ఏభాగోతుల జట్టులో చేరినా నెలకు పదిహేను రూపాయలు చులాగ్గా ఇస్తారు, నేచెపుతున్నాగా!-దీనికితోడు ఇంకొంచెం కష్టపడి నేర్చుకున్నావంటే" అన్నాడు.

ఇంట్లో యెవరూ లేనప్పుడు అక్క యెదుట పాడేటప్పుడు, "అక్కా! నాగొంతు ఎలా ఉంది? పాటవస్తుందా నాకు?" అని యెన్నిసార్లు అడిగేవాడు. అక్క వాడిని ప్రోత్సహిస్తూనే ఉండేది యెప్పటికప్పుడు. కాని అక్క ప్రోత్సాహం ఎంత ఆశాజనకమైనదయితే యేం-ఇవాళ ఒక సంగీతపారంగతుడు అందులోనూ నాటకాల్లో వేషాలువేసి పతకాలుపొంది పేరుమ్రోగిన ఒక నటుడు ఇలా పొగిడేసరికి ఆ ఆనందంలో ఏంజవాబు చెప్పాలో తోచలేదు వాడికి.

"నీ యీపాట నాకు నేర్పవూ?" అని అడిగాడు. తర్వాత ఇద్దరూ కలిసి ఆపాట పాడారు మళ్లీ.

చాలాసేపు అయిపోయింది. నదిలో పడవలు రయ్‌రయ్‌న సాగిపోతున్నాయి. నది ఒడ్డున నీళ్లఅంచున ఎవరో వేటికోసమో వెదుకుతూ తిరుగుతున్నాడు. "వాడేమిటి వెతుకుతున్నాడు?" అని అడిగాడు అజయుడు. "వాడు కప్పపిల్లలకోసం వెతుకుతున్నాడులే" అన్నాడు అపూ. తర్వాత మళ్ళీ- "నువ్వు మాదగ్గర ఎందుకు ఉండిపోకూడదు భాయీ? ఎక్కడికీ వెళ్ళకు ఏం ఉంటావా?" అని అడిగాడు.

ఇంత చక్కటి కళ్లు ఇంతచక్కని కంఠం అయినా వాడిముందు తాను ఆ రాజకుమారుడైన అజయుడే! ఏ అడవిలోనో తిరుగుతూ తిరుగుతూ దారితప్పిపోయిన అందకాడైన రాజకుమారుడు హఠాత్తుగా తారసిలినట్లు- స్నేహమయింది-ఇద్దరూ ఏవో చిరకాలపు స్నేహితులైనట్లు... అలాంటివాడ్ని ఎలా విడిచిపెట్టటం మరి!

అజయుడు కూడా మనస్సు విప్పి చాలా సంగతులు చెప్పాడు. ఇలాంటి నేస్తం ఎప్పుడూ దొరకలేదు అతగాడించుమించు వలభైరూపాయలు కూడపెట్టాడు. ఇంకొస్త పెద్దవాడు కాగానే ఈ జట్టును వదిలిపెట్టేస్తాడు. యజమాని చచ్చేట్లు కొడతాట్ట. అంచేత ఆకుతోతు పాత సమాజంలో చేరుతాడట. అక్కడైతే చాలా సుఖం. రోజూ రాత్రిళ్లు పూరీలూ అవీ పెడతారు తినటానికి. తినకపోతే దానికి బదులు మూడణాలు బత్తెం ఇస్తారు. ఈ జట్టు వదిలేకాక మళ్ళీ అపూవాళ్ళ ఇంటికి వచ్చి, అప్పుడిక్కడే కొన్నాళ్ళుంటాడు. ఇంక కాసేపటికి ప్రొద్దుక్రుంకుతుందనగా, "పద, తమ్ముడూ! ఇవాళ ఇప్పుడే ప్రారంభిస్తారు. పెందరాళే పోదాం. 'పరశురామగర్వభంగం' కనుక వేస్తే నేనందులో 'నియతి' వేషం వేస్తాను అందులో నాకెంత మంచి పాట ఉందో చూడు" అన్నాడజయుడు.

మరో మూడు నాటకాలు పడ్డాయి. ఊళ్ళో ఎవరినోట విన్నా నాటకాల సంగతే పొలాలల్లో పనులు చేసుకునేవాళ్ళు, పడవలు లాగేవాళ్లు, గొడ్లను కాచేవాళ్ల దగ్గర్నుంచి అందరూ ఆ నాటకాల్లో విన్న క్రొత్తపాటలే పాడుతూండేవాళ్లు. ఊళ్ళో యువతులు ఆ నాటకాల్లోని కుర్రాళ్లని ఇంటికి పిలిపించుకుని, తమకు బాగున్న పాటలు పురమాయించి పాడించుకునేవాళ్ళు అపూ ఇంకో నాలుగయిదు పాటలు నేర్చుకున్నాడు. ఒక రోజున అపూ అజయుడి వెంట వాళ్ల విడిదికి వెళ్ళాడు. అప్పుడు ఆ నాటకంలో వాళ్లంతా మూగి, వాడినొక పాటపాడమని పట్టుపట్టారు. అక్కడి వాళ్లంతా అపూ బాగా పాడతాడని అజయుడు చెప్పగా విన్నారు. అడగ్గా అడగ్గా అపూ తన విద్య వెల్లడించుకోటానికి ఓ పాటపాడాడు. అంతా కలసి వాడ్ని తమ యజమానిదగ్గరకు పట్టుకుపోయారు. అక్కడకూడా వాడొక పాట పాడవలసి వచ్చింది. ఆ యజమాని పెద్దబొర్ర అదీ, నల్లగా ఉంటాడు. నాటకంలో వంత పాడుతూంటాడు. అపూ పాట విని, "ఇలా రా అబ్బాయ్! మాసమాజంలో చేరుతావా?" అని అడిగాడు. అపూ హృదయం ఆనందంతో అయిదింతలయింది. మిగిలిన వాళ్లు కూడా "నిన్ను మా సమాజంలోకి తీసుకుంటాం, రా" అంటూ చుట్టుముట్టారు. అపూ ఉద్దేశంకూడా అప్పుడే చేరిపోదామని! నాటకసమాజంలో వేషం వేయటమే జీవితానికి పరమావధి. ఈ సంగతి తన కిన్నాళ్లనుంచీ ఎందుకు తెలియలేదో అదే ఆశ్చర్యం! అపూ అజయుణ్ణి చాటుగా పిలిచి, "సరేకాని భాయీ! నేనిప్పుడే చేరుతాననుకో, నాకేం వేషం ఇస్తారు?"

 # పథేర్ పాంచాలి 

అని అడిగాడు. "ప్రస్తుతం కాలికత్తె-గిలికత్తె లేదా ఏదైనా కుర్రవాళ్ల వేషాలు ఇస్తారు. తర్వాత బాగా తరిఫీదు అయినాక—" అన్నాడు అజయుడు.

కాలికత్తె మొదలైన చిల్లర వేషాలెయ్యటం అపూ కిష్టంలేదు. తాను జరీపాగా నెత్తిన పెట్టుకుని, కత్తిపుచ్చుకుని యుద్ధం చేసే సేనాధిపతి వేషం వెయ్యాలి. తాను పెద్దయాక నాటకాల్లో చేరుతాడు; అదే జీవితానికి ధ్రువలక్ష్యం! అజయుడు వల్లరాయిలా ఉన్న ఒక కుర్రాణ్ణి చూపిస్తూ రహస్యంగా-"అదుగో చూశావా వాణ్ణి? వాడి పేరు 'విష్ణుతేరి.' నేను డబ్బిచ్చి అగ్గిపెట్టె కొనుక్కుని తలకింద పెట్టుకుని పడుకుంటూ ఉంటాను. చుట్ట వెలిగించుకుంటానని అగ్గిపెట్టె అడిగి తీసుకుంటాడు. మళ్ళీ ఇవ్వడు. నాకు రాత్రిళ్ళు భయం వేస్తుంది, అగ్గిపెట్టె ఇచ్చెయ్యమని అడుగుతుంటాను. చీకట్లో గుండె పీచుపీచుమంటూ ఉంటుంది. అంచేత ఆరోజున నేను ఇవ్వమని అడిగితే లెంపమీద కొట్టాడు. బాగా అభినయం చేస్తాడని చెప్పి యజమానికి వాడంటే చాలా యిష్టం. కాని వాడిముందు యేం మాట్లాడానికి వీల్లేదు" అని చెప్పాడు రహస్యంగా అజయుడు.

తర్వాత అయిదు రోజులకి నాటకాలన్నీ అయినాక, వాళ్ళు అక్కడినుంచి ప్రయాణమైనారు. అజయుడు వాళ్లింట్లో కుర్రవాడిలాగానే కలిసిపోతూండేవాడు. ఈ నాలుగురోజుల్లో అతడు అపూకొక సోదరునిలా అయ్యాడు. కొంచెం ఇంచుమించుగా అపూ యీడువాడే. అతడికి ఆత్మీయులెవరూ లేరని తెలియటంతో సర్వజయ అజయుణ్ణి అపూని చూసినట్టే చూసింది. దుర్గకూడా అతణ్ణి తన తమ్ముడిలాగానే చూసింది. అతడిదగ్గిర పాటలు నేర్చుకుంది, ఎన్నో కథలు చెప్పింది, తన అత్తయ్యసంగతులు చెప్పింది. ముగ్గురూ కలిసి వాళ్ల వసివాకిట్లోనే ఆడుకునేవాళ్లు.




అన్నందగ్గిర అతణ్ణి బలవంతంచేసి తినిపించేవాళ్లు. నాటకాల్లో ఉండేవాడు, ఏం తింటాడో, ఎక్కడ పడుకుంటాడో అడిగే దిక్కులేరు. ఇల్లూ వాకిలీ, ఆపేక్ష-అంతఃకరణల స్పర్శ పుట్టినప్పట్నుంచీ నోచుకుని యెరుగడు పాపం. ఇక్కడ తలవనితలంపుగా ఆపేక్ష - అంతఃకరణలు చవిచూడడంతో చటుక్కున వాటిని వదిలివెళ్లలేకపోయాడు.

వెళ్లేముందు తాను కష్టపడి కూడబెట్టుకున్న డబ్బులోంచి అయిదురూపాయలు తీసి సర్వజయకి ఇవ్వబోయాడు. కాస్త సిగ్గుపడుతూ—"ఈ అయిదు రూపాయలూ పెట్టి అక్క పెళ్లికి ఏదైనా మంచిబట్ట ఒకటి కొని-" అని చెప్పాడు.

"వద్దు నాయనా! వద్దు నువ్వు మాట అన్నావు, అంతేచాలు. డబ్బు ఇవ్వనక్కర్లేదు. నీ కెంతో అవసరం ఉంటుంది డబ్బుతో! పెళ్లిచేసుకుని ఓ ఇంటివాడివి కావాలి-" అన్నది సర్వజయ

అయినా అజయుడు విడిచిపెట్టలేదు. చివరికి ఎంతో నచ్చచెప్పినమీదట ఇవ్వటం మానుకున్నాడు.

తర్వాత వాళ్లింట్లో వాళ్లందరూ కుమ్మరం దాటి కొంతదూరం వెళ్లేవరకూ వెంటవచ్చి సాగనంపారు "అక్క పెళ్లికి నాకు ఉత్తరం రాయటం మాత్రం మరిచిపోవ"ద్దని వెళ్లేప్పుడు మరీ మరీ చెప్పివెళ్లాడు.

తుమికిచెట్ల నీడల్లోంచి ఆ కుర్రవాడి సకుమారరూపం పొదలచాటున అదృశ్యమయిపోగానే - చటుక్కున సర్వజయకి- 'పాపం, ఒరి పసిగుడ్డు. ఈ యీడులోనే పొట్టకూటి సంపాదనకై బయలుదేరాల్సి వచ్చింది! మా అపూ కూడా ఇలా బయలుదేరవలసివచ్చినట్లయితే—అమ్మో!' అనిపించింది......

## 24

హరిహరుడు మొదట్లో కాశీనుంచి వచ్చినప్పుడు 'అతడి భవిష్యత్తు చాలా ఉజ్వలంగా ఉంటుంది అంత చదువుకున్నవాడు ఈ చుట్టుప్రక్కల ఎక్కడా లేడు' అనుకున్నారందరూ. అందరూ అతడి చదువును పొగిడేవాళ్లు. ఇహ నేడో ఒకటి కొయ్యక మానడు అనుకునేవాళ్లు. ఎవళ్ళో వచ్చి తన భర్తకి గొప్ప ఉద్యోగం కట్టబెడతారని సర్వజయ కూడా అనుకుంటూ ఉండేది. ఆ ఉద్యోగం ఇచ్చే దెవరు అన్న విషయంలో ఆమె ఊహ మంచుకప్పిన సముద్రగర్భంలా అస్పష్టంగా ఉండేది. కాని నెలలకి నెలలు, ఏళ్లకి యేళ్లు—ఎన్నో గడిచిపోయాయి కాని అర్ధరాత్రి జరీపాగాలు ధరించి, గుర్రాలమీదెక్కి, తన భర్తను ఆస్థానపండితునిగా నియమించుకున్నట్లు అధికారపత్రాలు చేతపుచ్చుకుని ఎవరూ రాలేదు. అరబ్బీ కథల్లోని దైత్యదేవుడూ ఇంద్రజాలంతో రత్నఖచిత - ఆకాశాన్ని తన నట్టింట వాలేట్టూ చెయ్యలేదు. పైగా పాతపడి, పుచ్చుపడుతున్న తమ ఇంటి కిటికీలూ, తలుపులూ ద్వారబంధాలూ ఇంకా పుచ్చిపోసాగాయి. వెన్నుగాడి కూలిపడేందుకు సిద్ధమవుతోంది. మొదట్లో ఉన్నంత ఇదిగానైనా లేదిప్పుడు. అయినా ఆమె మాత్రం ఆశ వదులుకోలేదు. హరిహరుడుకూడా దేశాలమీదికి వెళ్ళివచ్చినప్పుడల్లా 'అంతా ఏర్పాటైనట్టే. కొంచెం వ్యవధిమాత్రం పడుతుంది. అదృష్టం తిరిగినట్టే—అని ఏదో ఆశాజనకంగా చెపుతూ ఉండేవాడు. కాని ఏదీ తిరిగితే గా!

జీవితం మధుమయం అనటానికి కిదే హేతువు - అను ధుర్యమంతా చాలావరకు ఊహించుకున్నదీ - కలగాంచినదే అయి ఉంటుంది స్వప్నం మిథ్య అయితే కానియ్ ఊహల్లో వాస్తవికత అణుమాత్రమైనా లేకపోతే పోనియ్. అన్నప్పుడల్లా వాటికి సార్థక్యం ఉండకపోవచ్చు. అయితే యేం, జీవితంలో తమకు ఉద్దోలంగా సిరి ఏదో వచ్చిపడితే సరి! దాని ఉనికి ఊగిసలాడకుండా ఉంటే సరి! సారక్యం, లాభాల కేమివచ్చె: స్వల్పాతి స్వల్పాలవి!

హరిహరుడింట్లోంచి వెళ్లి రెండుమూడు నెలలయింది ఇంట్లో ఖర్చుకి డబ్బు - అదీ చాలా రోజుల్నుంచి ఏమీ పంపలేదు. దుర్గకి సుస్తీ ఎక్కువవుతోంది. తింటూ ఉంటుంది. సుస్తీ చేస్తూ ఉంటుంది. రెండు రోజులు మళ్ళీ కాస్త ఉసులుగా ఉన్నట్టే ఉండి, మళ్లీ పడక పెడుతూ ఉంటుంది.

సర్వజయ కూతురి పెళ్లివిషయమై భర్తను యెప్పుడూ ఒత్తిడిచేస్తూ ఉండేది. అతడిచేత నరేంద్రుని తండ్రి రాజేశ్వరబాబుకి రెండుమూడు ఉత్తరాలు రాయించింది. ఇంకా ఆ ఆశమాత్రం వదలుకోలేదు. "నీకేమైనా పిచ్చా యేం? అవన్నీ గొప్పవాళ్లకి చెందిన వ్యవహారాలు. రాజేశ్వరబాబు వచ్చి మనల్ని అడుగుతాడా!" అనేవాడు హరిహరుడు. అయినా సర్వజయమాత్రం విడిచిపెట్టలేదు. "వ్రాయండి ఇంకొక ఉత్తరం వ్రాసి చూడండి, నీరేన్కి, నచ్చిందేకదా!" అనేది సర్వజయం.

రెండు మూడు నెలలు గడిచేవి. ఉత్తరమేమీ వచ్చేదికాదు. మళ్ళీ ఓ ఉత్తరం రాయండని భర్తని వేధించుకు తినేది.

ఈసారి హరిహరుడు ఇంట్లోంచి వెళ్లే ముందు "ఇహ ఈసారి ఈ ఊరునుంచి ముకాం యెత్తి వెళ్లిపోయే ఏర్పాటేదో గట్టిగా చేసుకుని మరీవస్తాను" అని చెప్పి వెళ్లాడు.

వీథిలో ఒక పెడగా చక్కగా అలికి ముగ్గులు పెట్టిన మూడు నాలుగు గదుల ఇల్లు - ప్రక్కన పశువులపాకలో ఒక పాడిగేదె, పాడిఆవు, గడమంచె నిండా చిట్టు, తవుడు బస్తాలు, గాదెనిండా ధాన్యం! పచ్చని చేల మీదుగా మెల్లాలోకి వీచే గాలి, వింతవాస వల్లె వెదజల్లుతూండటం! కోయిలలు, గోరువంకలు మొదలైన పక్షుల కిలాకిలారావాలు. అప్పా ప్రొద్దున్నే లేచి, కుండనిండా పిండిన నురుగుతో ఉన్నపాలు గ్లాసునిండా తెచ్చుకుని, వేడివేడి ఫలారం చేసి, ఆ పాలు త్రాగి చదువుకోటానికి కూర్చుంటాడు. దుర్గకిహ మలేరియా ఉండదు. అందరూ వచ్చి తాము ఫలానా అని తెలుసుకుని, మర్యాద చేస్తారు. పాదధూళి స్వీకరిస్తారు. పేదవాళ్లనే దృష్టితో ఎవరూ నిర్లక్ష్యంగా చూడరు—'

ఇలా ఊరికే పగలు-రాత్రి అని లేకుండా సర్వజయ యెప్పుడూ కలలు కంటూ ఉంటుంది. ఇన్నేళ్లకి ఇప్పుడిహ ఏదో ఒకటి కలసిరాక మానదు—అని మనసుకి ఎవరో చెప్తున్నట్లు తోచేది.

అయితే ఇన్నాళ్లనుంచి ఎందుకు కలిసి రాలేదు? ఇప్పుడే యెందుకు కలిసిరావాలి? చిన్నప్పుడు జామచెట్లు ములగచెట్ల క్రింద తిరుగుతూ గడపిననాటినుంచీ — కన్నె నోములు నోచే రోజులలో కూడా తన మనస్సులో గూడుకట్టుకున్న వాంఛ—లక్ష్మీదేవి పారాణికాళ్ల గుర్తుతో మెల్లా అంతా కలకలలాడే అత్తవారింటికి కాపురానికి వెళ్లాలనే. ఇలా కూలిపోయేందుకు సిద్ధంగా ఉన్న పాతకొంప, ఈ వెదుళ్ల అడవి— ఎవరు కోరుకున్నారు?

దుర్గ ఎక్కడినుంచో చిన్న కందదుంప ఒకటి పట్టుకువచ్చి వంటయింట్లో మొండికత్తి కూర్చునేది. "అదేమిటే దుర్గా? ఇవాళిలా తింటావు అన్నం? నిన్న సాయంత్రం కూడా తగిలిందికదా జ్వరం!" అనేది తల్లి. "ఏతే అయిందిలే అమ్మా! కాస్త గట్టిగా చలి వేసినంతమాత్రాన అదీ జ్వరం వచ్చినట్లేనా యేం! ఈ దుంప కాస్తా కూరవండి, రెండు మెతుకులు పెట్టు ఇవాళ అమ్మా!" అనేది దుర్గ.

"ఛా. ఒంటికి ఏదయినా వచ్చినప్పుడు నీకు మరీ ఏదైనా తినాలని ఒకటే రంధి, ఇవాళ, రేపు కాస్త ఉసులుగా ఉండనీ. ఎల్లుండి అలాగే పెడతాను" అన్నది తల్లి.

ఎంతో బ్రతిమాలగా, బ్రతిమాలగా దుర్గ ఆ దుంప తీసుకెళ్లి అవతల పెట్టేసింది. కాసేపు కదలకుండా కూర్చుని, తనలో తాను-'ఇవాళ చాలా తేలిగ్గా ఉంది, ఇంక జ్వరంరాదు నాకు. మధ్యాహ్నం రెండు ఉడకబెట్టిన ఉర్లగడ్డలు, రొట్టెలు తింటాను-' అనుకునేది. కాసేపటికల్లా ఆవలింతలు ప్రారంభమయేవి. ఇది జ్వరం వచ్చే సూచన అని తెలుసు దుర్గకి. అయినా 'ఆవలింతలు వస్తే వచ్చాయి, ఎన్నిసార్లు రాలేదు! ఇహ జ్వరం మాత్రం రాదు' అని మనస్సును సమాధానపరుచుకునేది. క్రమంగా చలి యెక్కువై ఎండలోకి పోయి కూర్చుందామనిపించేది. ఎండలోకి వెళ్లటాన్ని నిగ్రహించుకుని, 'చలి వెయ్యటం మామూలు శారీరకధర్మం. జ్వరం రావటానికి దీనికీ సంబంధం యేముందిలే:!' అనుకునేది.

కాని ఎంత సమాధానపరచుకున్నా ప్రయోజనం ఉండేదికాదు. ఎండ ఎక్కుతున్నకొద్దీ జ్వరం ఎక్కువయేది. తల్లి ఎక్కడ చూసిపోతుందో అని చాటుగా ఎండపొడ ఉన్నచోటికి పోయి కూర్చునేది. 'జ్వరం, జ్వరం అనుకుంటూ ఉండటంవల్ల ఇలా ఉంది కాని, అసలిది నిజమైన జ్వరం కాదు,' అనిపించేది మనస్సుకి.

పాకుడుపట్టిన మొండిగోడమీదికిపోయేది కరకరలాడే యెండ. అకేధ్యాసగా కూర్చోకుండా ఉంటే జ్వరం దానంతటదే పోతుందని దుర్గ నమ్మకం. అప్పాని పిలిచి, "కాసేపు నాదగ్గర కూర్చోరా, కథలు చెప్పుకుందాం" అనేది.

నిరుడు-ఒక రోజున జోరుగా వర్షం కురిసిననాటిరాత్రి, అప్పా సలహాప్రకారం తెల్లవారగట్ల తాటిపండు ఎత్తుకు వద్దామని సతూవాళ్ళతోటలోకి వెడుతూంటే చటుక్కున అరికాళ్లనిండా ముళ్లు గుచ్చుకున్నాయి. ఆనొప్పికి అక్కడే ఆగి, వెనక్కి ఓ అడుగు వేసేసరికి ఆరెండోకాలికి కూడా గుచ్చుకున్నాయి.

మర్నాడు ప్రొద్దున చూస్తే ఆ వరుసవరుస అంతా ముళ్లే. రాత్రిళ్లు వాళ్లు వచ్చి తాటిపళ్లు రాలితే ఎక్కడ ఎత్తుకుపోతారో అని సతూ తుమ్మమండలు కొట్టాడు ఆ స్థలం నిండా.

మరొకరోజున ఇంకొక విచిత్ర సంఘటన.

ఎక్కడినుంచో ఒక ముసలి బెంగాలీ సాయిబు-రంగు రంగుల అద్దాలు అమర్చిన సీనారేకుపెట్టె ఒకటి తీసుకువచ్చి అందులో బొమ్మలాడించి చూపించటం మొదలెట్టాడు. ఆ వీథిన జీవన్‌చౌధురిగారి ఇంటి ముంగిలిలో చూపిస్తున్నాడు. దుర్గ ప్రక్కనే నుంచుని ఉంది. దగ్గిర డబ్బులేవు. అందరూ కానీ కానీ ఇచ్చి గొట్టంలోంచి ఏమిటో చూస్తున్నారు.

ముసలి సాయిబు డబ్బా వాయిస్తూ రాగ

 # పథేర్ పాంచాలి 

ళోరణిని 'కాశీపట్నం చూడర బాబూ! గంగా మాతను చూడర బాబూ!' అంటూ పాడుతున్నాడు. ఒక్కొక్కరే చూడటం అయిపోయి, ఆ గొట్టంముందునుంచి చూపు ఇటు త్రిప్పగానే ఎంతో ఆసక్తితో "ఏం కనబడింది అందులో? అన్నీ నిజమైనవేనా?" అని అడిగింది.

ఉష్! వాళ్లెన్ని అద్భుతాలు చూశారో అవన్నీ చెప్పలేకపోయేవాళ్లు.

ఏమిటి అవన్నీ!

ఒక్కొక్కరే అందరూ చూసి వెళ్లిపోతున్నారు. దుర్గకూడా వెడదామని బయలుదేరింది. "చూస్తావా అమ్మాయ్ నువ్వుకూడా?" అని అడిగాడు ముసలి పాయెబు. దుర్గ తల త్రిప్పుతూ "ఊహూ! నా దగ్గర డబ్బులేవు" అన్నది.

"రా, రా అమ్మాయ్: చూసి వెళ్లు. డబ్బివ్వద్దులే" అన్నాడతడు.

దుర్గ ఇంత ముఖంచేసుకుని ఆ పెట్టె దగ్గరకు వచ్చింది, కాని ధైర్యంచేసి, ముఖం తీసికెళ్ళి ఆ గొట్టంముందు పెట్టలేదు. "ఈ గొట్టంలోంచి చూడాలి అమ్మాయీ!" అన్నాడతడు.

దుర్గ ముఖంమీద పడుతున్న జుట్టును రెండు చేతుల్తో వెనక్కి తీసుకుని, ఎంతో ఆబగా చూసింది. తర్వాత ఓ పది నిమిషాల పాటు తాను చూసినది చెప్పలేకపోయింది. నిజమైన మనుష్యులు బొమ్మల్లో ఎలా కన్పిస్తారు! ఎంతమంది దొరలు, దొరసానులు, ఇళ్ళు, మేడలు, ఊళ్లు, నదులు కొండలు, యుద్ధాలు అవన్నీ చెప్పలేదు తాను. ఎన్ని అద్భుతాలు చూసింది తాను!

తమ్ముడికికూడా చూపించాలని మహా అనుకుంది. ఎన్నిసార్లో వెతికింది, కాని ఆ ఆట మళ్లీ ఊళ్లోకి యెప్పుడూ రాలేదు.

కబురు ఇంకా పొంతం అవకముందే దుర్గ జ్వరతీవ్రత కింక కూర్చోలేకపోయేది. లేచి లోపలికివెళ్లి బొంతకప్పుకుని పడుకునేది.

ఈమధ్య తండ్రి ఊళ్లో ఉండటంలేదు. అపూని పతికి పట్టకోవాల్సి వస్తోంది. పుస్తకాల దస్తరం చెదలుపట్టేస్థితికి వచ్చింది. ప్రొద్దున్నే లేచి ఇన్ని గోలీలు తీసుకుని



ఊరిమీద బయలుదేరినవాడు, మళ్ళీ పొద్దు వడిసొత్తిమీదికి వచ్చాక ఇహ తిండివేళకే ఇంటికిరావటం!—'మరీ బొత్తిగా భయం లేకుండా తయారయావు చదువంతా కుంట పెట్టి గంటవాయించినట్లేగా! ఈసారి మీ నాన్న ఇంటికిరానీ, నీ సంగతంతా చెప్పి నిన్ను—' అని తల్లి కేకలేసేది.

అపూ వాడలిపోతూ దస్తరం దగ్గిరేసుకు కూర్చునేవాడు. పుస్తకాలచుట్టూ పరుచుకునేవాడు. "కాస్త కవిరి ఇయ్యి అమ్మా! సిరాలో కలుపుకుంటాను" అనేవాడు తల్లితో.

తర్వాత ఇహ కూర్చుని రాసి రాసి, అది తీసుకువెళ్ళి ఎండలో పెట్టేవాడు ఎండిన తర్వాత కవిరికలిపిన సిరా తళతళలాడుతూండేది. అపూ మహా సంతోషంతో దానికేసి చూస్తూ 'రేపట్నుంచీ ఇంకా కాస్త కవిరి కలుపుతూంటాను. అరె! ఎంత తళతళలాడుతోందో!' అనుకునేవాడు. తర్వాత మళ్లీ రాసి, యెండలో పెట్టి, నిన్న రాసినదానికి, ఇవాళ రాసినదానికి తళతళలో యెంత తేడా ఉంటుందో గమనిస్తూ కూర్చుని, 'శేష్; ఇంకా స్త కలిపితే సరి!' అనుకునేవాడు.

ఓరోజున తల్లి దగ్గిర పట్టుబడ్డాడు. "అబ్బాయికి రాతలో పసలేదు కాని, కవిరి మాత్రం సుద్దలు సుద్దలు కావాలి. తియ్యద్దు కవిరి ఏమనుకున్నావో!..." అన్నది పేటుబడిపోయి తెల్లమొహం వేస్తూ "కవిరి లేంకే సిరా యెట్లా తయారవుతుందేమిటి? నేనయితే ఇహ ఊరికే—"

"అహా. కవిరిలేంకే సిరా అవుతుందా? దేశంలో ఇంక ఏ పిల్లలూ రాసుకోవటం లేదు కాబోలు. వాళ్లందరికోసం రోజూ దుకాణాల్లో సేర్లకి సేర్లు కవిరి అమ్ముతున్నారా! పో—నువ్వు—'

అపూ అదేపనిగా కూర్చుని ఓ పుస్తకంలో నాటకం రాస్తున్నాడు. పుస్తకం అంతా చాలా భాగం వ్రాతతో నిండిపోయింది. మంత్రి విశ్వాసఘాతుకతవల్ల రాజు రాజ్యం వదిలి అడవికిపోతాడు. రాజపుత్రుడు నీలాంబరుడు, రాజపుత్రి అంబ అడవిలో దొంగలచేతుల్లో పడతారు ఘోర యుద్ధం అవుతుంది. తర్వాత రాజపుత్రిక శవం యేటిఒడ్డున కన్పిస్తుంది. నాటకంలో సత్యా అనే పాత్రలోని క్రూరత్వం పూర్తిగా వర్ణితం కాకపోయినా, ఆ పాత్రికే మరణ శిక్ష విధింపబడుతుంది. నాటకంలో చివర నారదుని. వరప్రభావంవల్ల అంబ తిరిగి బ్రతకటం, విశ్వాసపాత్రుడైన సేనాపతి శీలకేతుతో ఆమెకి వివాహం జరగటం—

ముందరైన సంఘటనలనుబట్టి క్రితం ఖంలో ఇక్కడ ఆడిన నాటకానికి దీని పాత్రలపేర్లు మార్పు తప్ప, మిగిలినకథ, సంఘటనలు ఒకటే అని, దానికిది మక్కికి మక్కి కాపీ అని అనేవాళ్లు ఒక్క సంగతి మరిచిపోతున్నారనకతప్పదు—గతంలో ఏ వెన్నెలరాత్రి వేళనో నిశ్శబ్దంగా, మసక వెలుతురుగా ఉన్నగదిలో పడుకున్న ఏ ప్రాచీనకవికో నీలమేఘంలా కన్పించిన, నెమళ్లు నాట్యంచేస్తున్న వనప్రదేశపు స్వప్నం—కాళిదాసుకి విముక్తమేఘాల్ని వర్ణించే ప్రేరణ కలిగించివుంటే—దానివల్ల నష్టమేముంది? విస్మృతిగర్భంలో పడిన ఆ శుభయామినీస్మృతి మానవునికి తెలియకుండానే వేలకొలది సంవత్సరాలు అంటిపెట్టుకునే ఉండిఉంటుంది.

అగ్నిని అగ్నితోనే జ్వలింపచెయ్యాలి. దస్తరంలో ఓ పుస్తకం ఉంది. దానిపేరు చరితమాల. 'ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ప్రణీతం' అని రాసిఉంది పాత పుస్తకం. అపూతండ్రికి పిల్లలకోసమని ఎక్కడెక్కడి పుస్తకాలో సంపాయించటం ఓ అలవాటు. అలాగే ఈ పుస్తకమూ ఎక్కడో తీసుకువచ్చాడు. అపూ అప్పుడప్పుడు అది కొంత చదివాడు. ఆ పుస్తకంలోని కథల్లో వ్యక్తుల్లా కావాలని వాడి అభిలాష. బజారుకిపోయి బంగాళాదుంపలు అమ్మకుని రమ్మంటే ఆ రైతుబిడ్డ 'రస్కో' ని ఫుంతప్రక్కనో కూర్చునిబీజగణితాన్ని గురించి నే వితర్కించుకుంటూఉండేవాడు. కాగితాలు లేక తోళ్ళ మీద ఏ దబ్బనం లాంటి దాంతోనో లెక్కలు చేసేవాడు. గొర్రెలకాపరి 'డూవాల్' గొర్రెల్ని వాటి యిష్టంవచ్చినట్లు తిరిగేందుకు వదిలి, భూగోళశాస్త్రం చదవటంలో మునిగిపోయేవాడు. తానూ అలా కావాలని కాంక్ష! 'బీజగణితం' ఎంత ఇదిగా ఉంటుంది. తానూ 'రస్కో'లా బీజగణితం చదవాలి. తనకీ చూచి వ్రాతలు రాయటం, ఎక్కాలు వల్లించటం ఏమీ బావుండలేదు. ఇలా నిర్జనప్రదేశంలో అడవిలో ఏ ఫుంతప్రక్కనైనా కూర్చుని. భూగోళం-(అదేమిటో తెలియదు) మొదలైన పెద్ద పెద్ద పుస్తకాలు చదివి పండితుడు కావాలి! కాని తనకవన్నీ ఎక్కడ దొరుకుతాయి? ఎక్కడ భూగోళం, ఎక్కడ బీజగణితం, ఎక్కడ లాటిన్ వ్యాకరణం? ఇక్కడ ఒట్టి ఎక్కాలపుస్తకాలు, వాచకాలే!

అమ్మ కేకలేస్తే ఏమయినట్లు? తాను చదవ తలచుకున్నది ఇక్కడేది?...

(ఇంకా ఉంది)



బొజ్జన్న కొండ బౌద్ధ విహారముల దృశ్యం. ఫొటోలు: శ్రీపాద వెంకన్న కడప.





# "బొజ్జన్న కొండ"

ఆంధ్రదేశంలోని పెక్కు బౌద్ధ విహారాలలో విశాఖజిల్లా అనకాపల్లికి సమీపమునగల బొజ్జన్న కొండ (బుద్ధన్నకొండ) ఒకటి. దీనికి దగ్గరలో 'లింగాలకొండ' అనే మరొక కొండ ఉంది. ఈ కొండ మీద చెక్కబడ్డ లింగములవల్ల ఈ పేరు వచ్చి ఉంటుంది. బొజ్జన్న కొండపై గల విహారములు, స్తూపములు, చైత్యగృహములు 50 సంవత్సరముల క్రితము వెలికి తీయబడ్డాయి. లింగాల కొండపై అసంఖ్యాకముగా గల లింగములే గాక ఒక గుహ కూడ గలదు. ఈ గుహలో ఇంతకు పూర్వము విగ్రహముండిన జాడలున్నాయి ఈ కొండల దిగువను 'హారీతి' యను రాతి విగ్రహము ఉన్నది.

బొజ్జన్నకొండపై మహాస్తూపము వద్ద రాతిలో లింగములు మొదలగు అనేక రూపములు మలచబడి ఉన్నవి. అవి మలచబడిన తీరును గమనించి, కొన్ని సంవత్సరముల క్రిందట పరిశోధనలు జరిపిన ఒక దాక్షిణాత్య పరిశోధకుడు ఈకొండ ఖగోళ పరిశోధనకు కూడా ఉపయోగింపబడినదేమో అని అభిప్రాయపడినాడు. ★



బొజ్జన్న కొండ గుహలోని బుద్ధవిగ్రహం





# కథ సుఖాంతమే

బి. ఎ. పరీక్షకు వెళ్ళిపోతున్నానని నాకైనా సరిగా తెలిసిందో లేదో... పెళ్ళి సంబంధాలు జట్లుజట్లుగా రావడం మొదలు పెట్టాయి నామీదికి. మొదటిపరీక్ష రాసిన రోజున నాన్నదగ్గర్నుంచి ఉత్తరంవచ్చింది; 'ఆఖరుపరీక్ష అయిన మరుక్షణంలో బయలుదేరి ఇక్కడకు రావలెను. పెట్టె బెడ్డింగ్ రాలు తరువాత తెచ్చుకున్నను ఫరవాలేదు...'

ఉత్తరంధోరణి చూస్తేనే తెలుస్తుంది. దానివెనకాల ఏదో కుట్రవుందని.

"అమ్ముడుపోయే వెధవ... కోరినధర ఇచ్చేటప్పుడు కానేదవరైతే నేం?— ఇది నాన్న ఉద్దేశం.

అందుచేతనే మావాళ్లంతా నన్ను రైలు దిగగానే ముట్టడించి, రెక్కలు విరిచికట్టి ఇంటికి ఈడ్చుకెళ్ళడం అసాధ్యమనితోస్తే ఏ 'పోలీసు గొడుగు' నీడనో ఓ 'పెట్టిపుట్టిన' బ్రహ్మరాక్షసికి కట్టేయడం అసంభవం కాదనే నిర్ణయానికి నేను రావలసివచ్చింది. తత్ఫలితంగా పరీక్షలై ఇరవైరోజులైనా ఇంటికెళ్ళే ప్రయత్నంగురించైనా ఆలోచించలేదు.

ఈలోగా నాన్నా నేనూ కార్డులమీద కత్తులు దూశాం. నాన్న మూర్ఖపుపట్టు చూసి మొండికెత్తాను నేను. నా మొండితనం చూసి మండిపోయాడు నాన్న.

ఆ ఇరవైరోజులూ వాస్తవానికి, ఆదర్శానికి మధ్య ఊగులాడుతూ గడిపాను. కాళ్ళకింద కన్నెలకన్నతల్లుల కన్నీళ్లు— కళ్ళెదుట టెన్నిసంతో పోటీపడే కట్నాలు.



మధ్యాన్నపు ఎండలాంటి నాన్న కోపంఅంత దుర్భరమైన పరిస్థితిలో...వాస్తవం వడగళ్లు కురిపిస్తుంటే పచ్చని సాహిత్యస్వప్నాల గుబురుల్లో తల దాచుకుందామనుకున్నాను. తల పగలడం తప్పిందికాని చిరుచెమటలా చినుకులు ఒంటి మీద కనపడుతూనే ఉన్నాయి.

ఇరవైరోజులూ అలాగడిపి ఇరవైఒకటో నాటి సాయంకాలం అలా గోదావరి గాలిలోనైనా గుండెను చల్లార్చుకోవచ్చు అనే ఆశతో బయలుదేరాను.

చూడాలికదా అని అద్దంలోకి చూశాను.

"నువ్వు బి. ఎ. పరీక్ష కెళ్లినవాడిలా... కనీసం పాసుచేసినవాడిలాగానైనా లేవు." చూడగానే చెప్పింది అద్దం.

## "ప్రేష్ఠ"

"ఎలాలేనో ఎందుకు! నాకొకావలసింది నేనెలా ఉన్నదీని."

"నీచేతిలో ఆ 'హామ్లెట్' నువ్వు చదివేదే అనిపించకపోతే, ఇన్నాళ్లనుంచీ నిన్ను చూస్తున్న నేనుకూడా "ఆఁ. ఎవరో ఆవారాలే" అంటే తేలిగ్గా నమ్మేదాన్ని. నాకంటె సులువుగా దగాతి నేవాళ్లుండరని నీకూ తెలుసు."

అద్దం అలా దేవుళ్లాడ్డం చూస్తే నాకు పరమసంతోషమైంది.

చేతులు సరిగామడతని షర్టు, మాసిన పైజామా, నెలక్రితం కట్లుతెంచుకున్న జుట్టు, నాదవునా కాదా అనిపించే 'నా ముఖం' పీక్కుపోయిన కళ్లూ...అదీ నా రూపం. "మా మజాగాఉందే అవతారం!" అనుకున్నాను.

విడిచి వెళిపోయేదే కదా అనే కాబోలు మా కాలేజీమీద అపూర్వమైన భక్తిభావం కలిగింది. ఆ కాలేజీ చరిత్రని నెమరువేస్తూ ఎంతసేపు కూర్చున్నానో ఆ గచ్చుమీద— తలెత్తేసరికి గోదావరిగాలి తియ్యగా గుసగుసలాడుతోంది, నా చెంపమీద ముఖాన్నానిచ్చి. గోదావరి అవతలిగట్టు ఎర్రకాలువా చుట్టుకుంది. గాలి ఆసరాతో ఉషారుగా పోతోంది ఓ పడవ.

అలా చూస్తూ తిరిగి మైకంలో పడ్డాను. ఆ మహావాహిని మహిమ ఏమిటో కాని నన్ను ఇన్నాళ్లూ వేధించే పీడకలలూ, గుండెమంటా తాత్కాలికంగా కన్ను మూశాయి.

...చప్పట్లు వినపడ్డాయి దగ్గరగా.... "ఎంత పిలిచినా వినపడదేం. అంత తన్మయత్వం ఏవిటండీ."

ఉలిక్కిపడ్డాను. ఈ ఊళ్లో నాతో మాట్లాడే ఆడవాళ్లెవరు! గాజుల గలగల లాంటి ఆమెనవ్వు విని తల ఎత్తాను. ఇంకా నవ్వుతోంది.

"ఒహో......మీ....రా" అన్నాను, గొంతుకని బలవంతంగా ఉషారుచేసి. ఆమె ఇంకా గుర్తుకు రావడంలేదు. కాలేజీ అమ్మాయి కాకపోదులే అని ధైర్యం చెప్పుకున్నాను. ఒడ్డునపడ్డ చేపలా కొట్టుకుంటోంది మనస్సు.

ఆమె మళ్లీ నవ్వింది. ఈ మారు ఆ నవ్వులో కొద్దిగా వ్యంగ్యం కనపడినట్లైంది.

"మీ పేరు-రాజుకదూ" ఆమె మాట్లాడింది మొదట.

"అవును."

"నా పేరు—వసుంధర...కదూ."

"అవు...ను" అతికష్టంమీద అన్నాను

ఆమె కిలారున నవ్వింది.

నేను మందతప్పిన గొర్రెలా ముఖం పెట్టాను.

"ఫరవాలేదులెండి. మరిచి పోవడం— పోకపోవడం మనచేతిలో లేవుగా," ఊరడించాలని ప్రయత్నిస్తోంది.

"మిమ్మల్ని మరిచిపోవడం — మరిచి పోవడం కాదుగాని-ఈ వేళ ఎంచేతనో.."

"ఈ వేళ మీరు మీలా లేరంటారు."

"సరిగ్గా అంతే కాదనుకోండి. హోరు గాలి...ఇరవై రోజుల క్రితం ఎగిరిపోయిన గడ్డిపరకల్ని ఓ క్షణంలో పోగుచేయడం చాలాకష్టం." రెండో వాక్యం నాలో నే ననుకుంటున్నా ననుకుంటూ అన్నాను.

అని తల పైకెత్తేసరికి-ఎంతసేపట్నుంచి చూస్తోందో ఏమో—ఆమె నన్ను చూపులలో కూస్తోంది. నేను ఆమె వేపు చూడగానే ఆమె గోదావరిలోకి చూడ్డం మొదలు పెట్టింది. ఎందుకో నన్ను నేను చూసుకున్నాను.

నేను పరమ అసహ్యంగా ఉన్నానని తోచింది.

"రండి అలా ఆ ఇసకలో కూర్చుందాం" వసుంధర దారితీసింది.

## ★ కథ సుఖాంతమే ★

"మహాప్రసాదం! అంతకంటేనా" అందామనుకున్నాను. నా ముఖం మతాబాలా వెలిగిపోతోందేమో... వసుంధర నవ్వింది.

"ఏమైనా అబ్జెక్షన్ ఉందా?"

"ఏంతమాత్రం లేదు."

నవ్వాను. నవ్వి ఎన్నాళ్లైందో.

"మీ ముఖంలోది చంద్రకళండీ!" వసుంధర కని పెట్టింది.

వసుంధర ముఖంలో ఉన్నది సూర్యకళ!

వసుంధర అవీ ఇవీ ఏమేమిటో చెప్పుకుపోతోంది. నేను ఊఁ కొడుతున్నాను... రాత్రి రెక్కలు విప్పుతోంది లోకాన్ని కప్పడానికి.

ఇంటికి పోదామని లేచాం. నేను చాలా తేలికయిపోయినట్లు తోచింది!

నేను నడుస్తూ ఆలోచిస్తున్నాను వసుంధర ఏదో తెలిసున్నవాణ్ణి మాట్లాడింది, స్నేహం అభిలషిస్తున్నట్లు కనిపిస్తుంది కూడాను. చంద్రుడే వచ్చి "నీ ఇంట్లో నే ఉంటా"నని పట్టింట్లో తిష్ట వేస్తే సంతోషించనివాళ్లుండరు.

"మీకు ఈ దారులన్నీ కంఠతా ఒచ్చల్లే ఉందే. తల ఒంచుకునే సందులన్నీ నడిచేశారు!"

తలెత్తి చూశాను. సైనికుల్లా బారులు తీర్చి ఉన్నాయి లాంతరు స్తంభాలు.

"అంతే అనుకోవచ్చులెండి. ఇలా కాలేజీకి వెళ్లడం...రావడంకదూ."

"ఇదే మా ఇల్లు" అన్నది వసుంధర.

ఇదే! కాని కాలేజీకి వెళ్తూ వసుంధర కనబడే అవకాశం లేదు. ఎందుకంటే నేను తొమ్మిదిగంటలకే హోటలుకువెళ్లి అక్కడనుంచే కాలేజీకి వెళ్లేవాడిని. (ఆ మేడ పక్క సందులోనే రెండు లాంతరు స్తంభాలు దాటితే మా లాడ్జి, మురికొట్టు లవా మొదలైన సర్వహంగుల్తోటీ దర్శనమిస్తుంది.)

"ఆ ఆంబోతు పడుకుందిమాశారూ, పేవ్‌మెంటుమీద. ఆ మెట్లమీంచే మా రూంలోకి వెళ్ళాలి."

"దగ్గర్లోనే ఉన్నాంగా...తరుచు కలుసుకుంటూ ఉండచ్చు. గుడ్ నైట్." ఇంట్లో ఎలక్ట్రిక్ బల్బు కాంతిలో చురుక్కున మెరిసి మాయమైంది వసుంధర. తలుపు మూసుకుంది.

ఆ మేడ వసుంధర తల్లితండ్రిది. చిన్నప్పుడే వసుంధర తల్లీతండ్రీ పోయారు. తాతగారివద్ద పెరుగుతోంది వసుంధర. ఇంటర్మీడియట్ పరీక్షకు వెళ్లింది.

నాకు స్వతహాగా జంతువులంటే ప్రేమ కాని ఆంబోతును అందరూ భక్తితో చూస్తారని కాబోలు...అడంటే నాకు మహా మండుకొచ్చేది. కాని, లాడ్జిముందు ఆంబోతును చూడగానే దాన్ని మేపాలని బుద్ధిపుటింది.

"బసవన్నా...లేవగానే నీ మొహమే చూసుకున్నావులావుందే ఈ వేళ!" దాని ముఖం నిమురుతూ అప్పుడేకొన్న అరటిపళ్ల అత్తం అందించాను. అది ఆ బహుమానం తన జన్మహక్కన్నట్లు తాపీగా, నిర్వికారంగా స్వీకరించింది.

ఈలవేస్తూ గది తాళం తీసి లోపలికి వెళ్ళాను. స్విచ్‌కోసం తడుముతుంటే అనుమానం వచ్చింది. 'రేపు వసుంధరని కలుసుకోవాలంటే ఇంటికి వెళ్ళాలా?'

తిన్నలు తికులుతాయని అనుమానం కలిగింది. వసుంధర తాతగారు "ఎవడీ అంటపెంకి?" అని అడిగితే! నేను వసుంధర క్లాస్‌మేట్‌ని కూడా కాను. అదో పెద్ద తెగని సమస్యగా కూర్చుంది. ఎంత ఆలోచించినా పరిష్కారం కనపడటం లేదు.

విసుగెత్తి ఆలోచనలదారి మళ్లించాను.

నాన్న పరీక్షలముందు ఆఖరిసారి డబ్బు పంపాడు. ఆ డబ్బు అయిపోయింది. సేవింగ్సుబాంక్‌లో ఓ నలభై రూపాయల వరకూ ఉంది. మహా ఐతే ఓ నెల గడుస్తుంది దాంతో. ఆ తర్వాత?

నాకు ఈ దరిదాపుల్లో ఉద్యోగం యేం దొరకదని నాకు పూర్తిగా తెలుసు.

ఇంటికి వెళ్లిపోతే.....

నా ఆత్మాభిమానం కరెన్సీనోట్లలో కాలి బూడిదౌతుంది.

తల బ్రద్దలుచేసుకున్నా ఏం దారి కనపడటం లేదు.

ఇదీ పరిస్థితి.

తిరిగి ఆలోచన వసుంధరవేపు మళ్ళించాను. వసుంధరతో గడిపినదంతా తియ్యని కలగా తోచింది. కమ్మగా నిద్ర పట్టేసింది.

*   *   *

కళ్ళు తెరిచేటప్పటికి ముఖంమీద ఎండ పడుతోంది ఇంటికప్పులోంచి. ఎవరిదో గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

ఒద్దికంగా లేచి అద్దంలోకి చూస్తూ జుట్టు సవరించుకుంటున్నాను, కిటికీ ఎదుట నిలపడి. పేవ్‌మెంట్ మాడిపోతోంది. ఐనా ఆంబోతు నిన్నటిచోటనే పడుంది. ఉంది కళ్లు మూసుకొని గతాన్ని గడ్డిని నెమరేస్తోంది.

రోడ్డుమీద మెరుపు మెరిసింది. ఇంటివారి గడియారం గంటలు కొట్టడం మొదలపెట్టింది.

ఇప్పుడున్న అవతారంలో కనపడ్డమా మానడమా అనుకుంటున్నాను. "హలో గుడ్‌మార్నింగ్" అంటూ ఆమె వచ్చేసింది.

గడియారం గంట విని "తొమ్మిదా... పదా" అని అడిగింది.

"తొమ్మిది. అప్పుడే ఎక్కడికి బయల్దేరారు?"

"అప్పుడే ఏమిటి! ఓహో మీకిప్పుడేగా తెల్లవారింది! అవున్లెండి. అట్టే ఏం లేదు. క్లాసమేలాలో మార్నింగ్ షో మంచిది ఉంది 'బొ'..."

"తొమ్మిదిముప్పావుకిగా షో మొదలు. ఇప్పట్నుంచి ఎందుకు...!"

"అయితే మరీ మంచిది. ఇక్కడే కూర్చుంటా."

నేను చాలా ఇబ్బందిలో పడ్డాను. నా మంచం, పై పడక చూస్తే అది ఎవరూ మనుషుల కుద్దేశించిందనుకోరు. కుర్చీనిండా పుస్తకాలున్నాయి. టేబిల్ మీద న్యూస్ పేపర్లు, తలనూనె, నేను సంవత్సరం క్రితమే విసిరేద్దామనుకున్న చెప్పుల జత, ఇంటివారబ్బాయి ఓనాటి సైకిలు తుడిచిన గుడ్డముక్క...ఇంకా ఎన్నో వింత వస్తువులు ఇరుక్కుని కూర్చున్నాయి. ఇవన్నీ చూసి సన్నగా నవ్వుతోంది ఆ అమ్మాయి-వసుంధర

"కూర్చోండి" అన్నాను. ఎక్కడ కూర్చోమని!

"కూర్చుంటాలెండి ఏదైనా పుస్తకం వెతుక్కుని..." అంది. తరువాత దృశ్యం చూడకపోవడమే మంచిదని, నేను బావికి దారితీశాను. పెరట్లోకి పోయి కిటికీలోంచి తొంగిచూశాను. పెళ్లికూతురులా ముస్తాబై ఒచ్చింది-పాపం. నా బట్టలపెట్టెమీద ఓ న్యూస్ పేపరు పరిచి కూర్చుంది. బరువుగా నిట్టూర్చి స్నానానికి పోయాను.

నేను తడితల తడుముకుంటూ వచ్చి తెల్లపోయాను గదిని చూసి.

గదిలోని వస్తువుల్లో విప్లవం వచ్చింది-ధర్మబుద్ధి వెల్లివిరిసింది అంతవరకూ కూర్చొని దురాక్రమణ చేసిన పుస్తకాలు ఉచితస్థానం చేరుకున్నాయి. ఏడాదిక్రితం పింఛను

పుచ్చుకున్న చెప్పులు 'గిలకైన్'కు పంపబడ్డాయి. గది 'భూగోళమే' మారిపోయింది. ఆమె శ్రమపడిందే అని కొద్దిగా సిగ్గు కలిగింది.

“వసుంధరా దేవిగారూ! మీకు మీ అద్భుత పనికి హృదయపూర్వక థేంక్స్.”

“అదేం భావమండీ ... అదేం భావమండీ!” వసుంధర ఉప్పెనగా నవ్వుతోంది. నాకూడా నవ్వొచ్చింది.

హఠాత్తుగా వసుంధర ఒడిలో ఉన్న ఓ పుస్తకం కనపడి కళవళపడ్డాను. అది నేను కథలురాసే పుస్తకం నా రహస్యం బయటపడింది. ఇంకా ఆమె సరిగ్గా చూసిలేదేమో, వెళ్లి ఆ పుస్తకం లాక్కుంటే!

మర్యాదగా అడుగుదామనుకున్నాను. గుటకలు మింగాను.

“అమ్మాయిగారూ మీరు నా రహస్యాల్ని దోచేస్తున్నారు. అన్యాయం!”

“అబ్బాయిగారూ మీరు నిజాన్ని దాచేస్తున్నారు. అనవసరం.” వెక్కిరింపుగా సాగదీసుకుంటూ సమాధానమిచ్చింది. తరువాత సీరియస్‌గా “మీ రహస్యాలు మీ దగ్గరే ఉంచుకోండి. స్నేహితులమధ్య రహస్యాలుండడం — ఉంటాయనుకోలేదు నేను” అని ఆ పుస్తకం నాకిచ్చేసింది.

ముచ్చటగా మూతి ముడుచుకు కూర్చొంది. నాకు కొద్దిగా బాధ కలిగింది ఆమె ఈ విషయాన్ని అంత సీరియస్‌గా తీసుకుంటుందనుకోలేదు. నేను మాత్రం! ఆమెకు నా పెన్ నేమ్ తెలిస్తే నాకు ఉరి పడుతుందేమో నన్నట్లు ప్రవర్తించాను.

పెన్ నేమ్ బయటపడితే ఉరితియ్యరు గాని-ఊపిరి సలపనివ్వరు.

“ఈ మధ్య మీ కథొకటి చూశానండి. వోడ్‌హౌస్ ధోరణిలో రాశారు. చచ్చాం నవ్వలేక.” వోడ్‌హౌస్ ధోరణిట! అది ఎంత నిజమో నాకు తెలుసు. నేను సిగ్గుపడి ముక్కునుంచి చెవులవరకూ కందిపోతాను. ఎంత తియ్యగా ఉన్నా అది అబద్ధమేగా! ఏదో చచ్చుసమాధానం కుంటుకుంటూ వస్తుంది నా నోట్లోంచి.

“కాని మీ కథలో...కథేం కనపడదేం!”

“హాస్యప్రధానమైన రచనల్లో అది సామాన్యంగా జరుగుతూనే ఉంటుంది. నవలలో శైలీ, వాక్యచమత్కృతీ-వంటివి తప్పించి కథ ఏమిటి అని చూస్తే శూన్యం ఎదురు కావచ్చు.”

“అంచేతనే కాబోలు. ఈ మధ్య ప్రతీ చెత్తా పత్రికల కెక్కుతోంది. కాఫీ తాగేరా— నేను తాగాలి మరి వెళ్లొస్తాను.” నేను వెంటనే షోడా కొట్టుకోసం చూస్తాను.

కాని వసుంధర ఆ జాతిలో ఎలా చేరుతుంది! చాలా మంచిపిల్ల వసుంధర.

నేను పగటివేషం ముగించి ఆమె వేపు చూశాను. ఆమె నాకేసే చూస్తున్నదల్లా మొగం తిప్పేసుకుంది. మాట్లాడ్డానికి సిద్ధంగా లేదన్నమాట! ఎంతవరకు పోతుందో చూద్దాం అనుకున్నాను. “సొగసు కత్తెలకి అలకలు కూడా ఓ శృంగారమేనండి” అంటాడు కరటకశాస్త్రి!

నేను తాళంకప్పె పట్టుకవెళ్లి గది బయట నిలబడ్డాను. తలవంచుకుని విసురుగా గది బయటకు వచ్చింది.

తలవంచుకు నడుస్తూ వాలుగా చూస్తోంది. నేనూ చూడనట్టు నటిస్తూనే చూస్తున్నాను. పేవుమెంటుమీదే నడిచేం కనుక ప్రమాదాలేం జరగలేదు.

హాలులో కూర్చున్నా నన్నమాటేగాని రెస్ లేకుండాపోయింది. ఒకవేళ నిజంగానే కోపం వచ్చిందేమో. ఎలాగా తేల్చుకోవడం?

ఇంటర్వల్ వరకూ స్క్రీన్ మీద దృష్టే లేదు. ఇంటర్వల్‌లో రెండు డ్రింకులు తీసుకున్నాను. ఒకటి నేను తీసుకుని ఆమె వేపు చూశాను. తీసుకోమన్నట్లు తల అటు తిప్పేసింది. ఆ తెచ్చిన వాడిచ్చిన డ్రింకు తీసుకుంది. నాకు కొద్దిగా ఉపశాంతి కలిగింది.

# ★ కథ సుఖాంతమే ★

పిక్చరుమీద దృష్టి మళ్లించానుకాని ప్రారంభం తెలియక ఏదో అయోమయంగా వుంది. వసుంధర పిక్చరు చూడ్డం మానేసి నావంకే చూస్తోందని గమనించి నేను స్క్రీన్ మీదే దృష్టి కేంద్రీకరించాను.

లైట్లు వెలిగాయి. హాలు బయటపడ్డాం.

"సర్వస్వం కోల్పోయిన హీరోయిన్ విషం తీసుకుందామని డాక్టరు రూంలోకి దొంగతనంగా వెళ్లి అక్కడ పంచ్ చదువుతూ కూర్చుందేమండీ?" వసుంధర జాలిగా చూస్తూ మాట్లాడింది.

బతికేవ్రా అని స్వేచ్ఛగా ఊపిరి పీల్చాను. కాని ఆ దృశ్యం చూసే భాగ్యం నాక్కలగలేదు. "దేన్ని గురించి మీర నేది?" అన్నాను.

"దేన్ని గురించా! అదిగో ఆ మేకని లాక్కుపోతోందేం...ఆ అప్పలమ్మని గురించి— అప్పలమ్మ అంట్లు తోముదామని బావిదగ్గరకు వెళ్లి భగవద్గీత ఎందుకు చదివిందీ అని" విసురుగా అంది.

నాకూ కోపం వచ్చింది. నేను మొదటి సగం చూడలేదు నిజమే. తను రెండో సగం చూడలేదుగా! నా తప్పేమిటి!

"ఓ అదా! హరిశ్చంద్ర నాటకంలో అక్షరాలురాని అభాగ్యుడు సంస్కృత పదాలువేసి మత్తకోకిల ఆశువుగా చదవలేదూ. ఎందుకు చదివాడూ!"

"ఎందుకా! సంస్కృతానికీ, సంస్కృతికీ దగ్గర సంబంధం ఉంది కనుక" తడుముకోకుండా సమాధానమిచ్చింది వసుంధర.

ఆ జవాబుతో నా శరీరంలో 'భూకంపం' వచ్చింది. నవ్వుతో పేగులు కదిలిపోయాయి. వసుంధరా నవ్వేసింది.

మా కలహం అందంగా అంతమైంది— మా సాన్నిహిత్యం మరింత అయింది, ఆ కలహం మూలంగానూ.

మా సమావేశాలు వసుంధర మేడమీదనే జరుగుతూండేవి. ఆ మేడపైన మూడు గదులూ ఎదురుగా విశాలమైన డాబా ఉన్నాయి. పెరట్లో కొబ్బరిచెట్లు మూడు పిట్టగోడని తల ఆనిచి-డాబామీదికి దల్లగా చూస్తూంటాయి. అటువంటి ఆ మేడ అంతటికీ రాణీ వసుంధర. వసుంధర తాతగారు క్రిందనే ఉంటారు.

వసుంధరకి తాతగారిచ్చిన ఓ చిన్న లైబ్రరీ ఉంది. ఓ కేరమ్సుబోర్డు, చిన్న చక్కని బాంజో ఇవీ వినోదసాధనాలు. పేకముక్కల పేర్లు కూడా తెలియవు వసుంధరకి.

ఒక ఆదివారం. ప్రయివేటుకి సెలవు. ఉదయం ఏడు గంటలకే వసుంధర రాజ్యంలో తిష్ఠ వేశాను.

"రాజూ! నేను స్నానంచేసి వస్తాను. అంతదాకా ఈ పుస్తకాలు చదువుకో. అల్లరి చెయ్యకేం." వసుంధర మెట్లుదిగి మాయమైంది. మే మిద్దరం కలిసి 'అండీ' ని ఎక్కడో దాని ఖర్మానికి వదిలేశాం.

కర్ర చప్పుడు వినిపించింది. వసు తాతగారు. మూడు నెల్లయినా ఆయన కంట పడలేదు నేను. ఈ వేళ నాకు ఏదో మూడిందనుకున్నాను. నేను అక్కడికి ఏ పనోదాలో ఒచ్చిందీ చెప్పమంటే... నేను వసుంధర క్లాసుమేట్ నేనా కాను. ఆయన కర్ర పైకెత్తి 'ఒన్...టూ...త్రీ...' అంటే...... మొండిగా తల ఒంచుకున్నాను పుస్తకం మీదికి.

గదిలోకి నీడపడింది. లేచి నిలపడ్డాను. ఆయన చిఱునవ్వుతో 'కూర్చో నాయనా కూర్చో' అన్నారు.

ఆయన పడకకుర్చీలో కూర్చుని ఓ నిమిషం కళ్లు మూసుకు తెరిచి 'నీతో మాట్లాడదామని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను. నీ గురించి కొంత తెలిసిందిలే." ఊపిరి బిగపట్టి వింటున్నాను. "నీ కథలు కూడా చూశాను."

"అవును కాని...మా వసుంధర నిన్ను ఒక్కరోజు చూడకపోతే ఉండలేదోయ్. పిచ్చితల్లి. కాపరానికి వెళ్తే ఎలాగో? అక్కడ ఏలాగో సరిపెట్టుకుంటుందిలే." ఉలిక్కిపడ్డాను. కాపరం ఏమిటి! ఆయన గ్రహించాడు.

'వసుంధరకి పెళ్లయింది బాబూ... తొమ్మిదో ఏట అయింది' ఆయన కథంతా వివరించి చెప్పారు.

బొమ్మల పెళ్ళిళ్ల రోజులలో-తినే వస్తువులు మాత్రమే తియ్యగా ఉంటాయనుకునే తొమ్మిదేళ్ళ వయస్సులో—వసుంధరకి పెళ్లయింది. ఆమె మొగుడు అప్పుడు ఇంజనీరింగు చదువుతున్నాడు.

'అతని కిప్పుడు క్షయవ్యాధి. రెండేళ్ళనుంచి శానిటోరియంలో ఉంటున్నాడు. అదేం వ్యాధో కాని అంతూ దరీ కనపడటం లేదు......" వసుని చూసి ఆయన ఆగిపోయారు....గది విడిచి సాగిపోయారు.

వెన్నెల వెలుగులో సాలెగూడు ఎంతో మనోహరంగా ఉంటుంది. మామూలుగా చూస్తే జుగుప్స కలిగించే ఆ దారాలకే వెన్నెల వన్నె తెస్తుంది.

నిన్న గదిలో పగులు సాలెగూడుని చూసి అదే అనుకున్నాను. 'సాలెగూడా అందుకే నిన్ను ఉండనిచ్చాను. నా గదిలోకి పగలుకూడా వెన్నెల వస్తుంది. తెలుసా" అన్నాను. అన్నానో లేదో వసుంధర గదిలోకి వచ్చింది.

వసుంధర ఒచ్చి నా జీవితంలో వెన్నెల పరిచింది. సాలెగూళ్ళు అందంగా ఉంటాయి ... తుమ్మముళ్ళు ముద్దొస్తూ ఉంటాయి లేకపోతే నాన్నమాట వింటే ఒచ్చే ఆ కట్నం, ఆస్తిలో నా కొచ్చే వాటా, బెజవాడలో మేడా ఒదులుకుని ఈ వూళ్లో మొద్దబ్బాయిలకు అక్షరాలు రాసిస్తూ ఆనందించగలిగేవాణ్ణా!

"దేవుడా ఈ కలలోంచి నన్ను కదలనివ్వకు - నన్ను కదిపావా కలతలన్నీ నన్ను కాల్చి మసిచేస్తాయి జీవితాన్ని భ్రాంతిగానే అంతం కాని ప్రభూ" అదీ నా ప్రార్థన.

కాని ఈ వేళ తెలిసింది కల త్వరలో కరిగిపోక తప్పదని వసుంధర భర్తకి రోగం తగ్గితే కాపరానికి తీసుకుపోతాడు. తగ్గక యావజ్జీవం బాధపడితే వసుంధర ఏడుస్తూ జీవిస్తుంది. ఏమైనా వసుంధర - నేను చెరో దారీ చూసుకోవలసిందే.

"తాతయ్య ఏమంటాడు రాజూ" వసుంధర తడిజుట్టు ఆరబెడుతూ అడిగింది. నేను బలవంతంగా నవ్వి "నా కథలలో భాష బాగులేదన్నారు. కావ్యాలూ, ప్రబంధాలు చదవమని సలహా ఇచ్చారు" అన్నాను.

"తాతయ్య అంతేలే. చాలా మంచి తాతయ్య కదూ రాజూ. మంచివాడు కాకపోతే నన్నిలా తిరగనిస్తాడా."

"అవున్లే" అన్నాను.

ఆపూట నేను భోజనం చెయ్యలేదు. వసుంధర జీవించటం లేదు...నటిస్తోంది. అంత సంతోషంగా ఎలా కనిపిస్తోందో.

వసుంధర నాతో మామూలుగానే మాట్లాడుతోంది. ఆమె అలా ఉండగా లేందే నా కింత గుండెబరు వెందుకో!

పది, పదిహేను రోజులలో నేను కోలుకున్నాను. తిరిగి నవ్వుతూ... పేలుతూ... రోజులు దొర్లుకుపోతున్నాయి

ప్రయివేట్లు సజావుగానే సాగుతున్నాయి కథలమీద ఏదో ఒస్తోంది హాయిగా జీవిస్తున్నాను. కాని నా అంత ఆనందంగా ఎవరూ ఉండరని నా నమ్మకం. ఎందుకంటే వసుంధరలాంటి అమ్మాయి వసుంధరే కనుక.

కాని ఎప్పుడు ఏం వినవలసివస్తుందో అనే భయం అప్పుడప్పుడు వచ్చేది. నవ్వుల జల్లుల ఆ అనుమానం అణిగిపోయేది.

వసుంధర తాతగారు విద్యాశాఖలో పని చేసి రిటైర్ అయ్యారు. ఆయనకు తెలియని ప్రాచీన కవి లేడు. రోజూ నాచేత అవే చదివించేవాడు. నా జన్మ తరించిందను కున్నాను. రెండేళ్లు కలలా గడిచాయి.

కాని...కల కరిగిపోతుంది ... పక్షులు వేరు వేరు గూళ్లు వెతుక్కుంటాయి అనే భయమే...

అలా రెండేళ్లు గడిచేక...ఒక రోజున వసుంధర తాతగారు ఏదో పనిమీద కాశీ వెళ్లారు. సాయంగా వాళ్లింట్లో ఉండమన్నారు—

పౌర్ణమి. వసుంధర మంచంమీద పడుకుని చంద్రుణ్ణి చూస్తోంది. నేను పడక్కుర్చీలో పడుకుని ఎంకిపాటలు చదువుతున్నాను. "ఈ రేయి నన్నొల్ల నేరవా రాజా... వెన్నెలల సొగసంత యేటిపాలేనటర!" ఆపాట చదివి ఆ పుస్తకాన్ని కళ్లకద్దుకున్నాను. చదువుతుంటే నిద్ర పట్టేసింది నాకు తెలియకుండానే.

వసుంధర భర్త రోగం అలాగే ఉండి పోయింది. వసుంధర వెన్నెలరాత్రులు మంగళసూత్రంమీద కన్నీరభిషేకిస్తూ గడిపింది ఎన్నేళ్లో. ఓ మారు నన్ను చూసి "కన్నీటి కళ్లకి వెన్నెలేం కనపడుతుంది. నా బతుకింతే రాజా. నువ్వుకూడా ఎందుకు నా చీకటి పంచుకుంటావు. పోయి పెళ్లి చేసుకో" అంది వలవలా ఏడుస్తూను. 'ఛీ! నేను పెళ్లి చేసుకుంటానా, నీ వాస్థితిలో ఉండటం చూసి' అన్నాను.

నేను పిచ్చెత్తినట్లు జీవిస్తున్నాను బడి పంతులుగా. పిచ్చి మేష్టారు అని పేరు నాకు. నేను ఉద్యోగంచేసి కళ్లకు చత్వారంజోడు జుత్తుకి వెండిరంగూ...నోటికి పెట్టుడు పళ్లూ ఆర్జించాను. నాకు మతినిలకడ పోయింది కాని పిచ్చాసుపత్రికి మాత్రం దూరంగా ఉంటూ వచ్చాను.

ఒక రోజున వసుంధర తెల్లటిజుట్టు విరబోసుకుని నాదగ్గరకువచ్చి 'పెళ్లాడిన కన్యని రాజా... పెద్దదాన్నై పోయాను. నువ్వు పెళ్ళిచేసుకోలేదా! ......నాకని నీకూడా పట్టిందా. అయ్యో రాజా" అని ఏడుస్తూ వెళ్ళి పోయింది తలగోడకేసి కొట్టుకుంటున్నాను. నలుగురూ ఒచ్చి ఆపారు. పిచ్చిగా వాగుతున్నాను. "నన్ను చావనివ్వండి. నా హృదయం చచ్చిపోయింది. నా ఆత్మ చచ్చి పోతుంది. నేను శాశ్వతంగా ఉంటానా నేను సిగరెట్లు కాల్చను. వసుంధర వెళ్ళి పోయిందిగా...వసుంధర వెళ్ళి పోయింది... బంగారు తల్లి... తొమ్మిదో ఏట పెళ్లి చేసుకొంది. భర్త ఇంజనీరు. ఆమెకేం కొదవ! కావలసినంత ఐశ్వర్యం. మేడ ఉందా లేదా! నాకు అసలు విషయం గుర్తొచ్చి ఏడుపొచ్చింది ... "పరపురుషుని తాకని వాళ్లను పతివ్రతలంటారు. భర్తను కూడా తాకలేదు వసుంధర. వసుంధరా! నువ్వు దేవతవి." అంటూ కేకను పెట్టాను......

పది రోజులు గడిచాక వసుంధర భర్త చనిపోయాడు. వసుంధర కప్పుడు అరవై ఏళ్లు.

'సంసారం లేకపోయినా వైధవ్యం తప్ప లేదు రాజా" వసుంధర గుండె పగిలేలా ఏడిచింది నన్ను చూసి. నాకూ ఏడుపు ముంచుకు వచ్చింది. ఇంకేం సముదాయించను!

* * *

నేను ఏడుస్తూ మేల్కొన్నాను. గాభరాగా చుట్టూ చూశాను వసుంధరకోసం. వసుంధర కనిపించలేదు. మంచంమీద ఉండాలే. ఏమైంది! నా కాళ్లు లబలబలాడుతున్నాయి మనస్సు అనేకవిధాల పోయి ముచ్చెమటలు పోశాయి. దారుణమైన కల... తిరిగి జ్ఞాపకం ఒచ్చి నిలువెల్లా కంపించి పోయాను వసుంధర ఏమైంది!

అతికష్టంమీద మేడమెట్లవరకూ నడిచాను. అక్కడ కూలపడ్డాను. ఎక్కడో పదకొండు గంటలు కొట్టారు. చెట్లు తల లాడిస్తున్నాయి.

వసుంధర మెట్లెక్కుతోంది తడబడుతూ అంది. "ఆయన పోయారుట రాజా. మనం తెల్లవారుఝామున బయల్దేరాలి. ఈ విషయం తాతయ్యకెలా తెల్పడం. టెలిగ్రాం ఇస్తావా?" చెప్పులకోసం పరుగెత్తాను.

* * *

తిరిగి పౌర్ణమి వచ్చింది. డాబామీంచి చూస్తే లోకమంతా స్వర్గలోకపు 'సెట్' లా ఉంది. వసుంధర పక్కని నిలబడింది వచ్చి.

"వసూ! మనం రిజిస్ట్రారు దగ్గరకు ఎప్పుడు వెళ్ళడం!"

"రేపు" ముసిముసి నవ్వులు నవ్వింది.

తోడుదొంగల్లా ఒకరి ముఖంలోకి ఇంకొకరం చూసుకున్నాం.

ఎల్లాగైతేనేం. అమ్ముడుపోలేదు నేను! ★



పాప కనుల్లో
పసిడి కలలు

ఫోటో :
బి. రవీంద్రనాథ్
—గుంటూరు.





లక్ష్మీ ప్రొడక్షన్స్ వారి 'ఇలవేలుపు'లో, శారదగా అంజలి.



చేతికందిన వందరూపాయల కాగితమే అయినా 'ఇంతేనా' అన్నట్టు అందుకున్నాడు శరభయ్య.
వాహినీవారి 'పెంకిపెళ్లాం'లో రేలంగి, రమణారెడ్డి.

# బొంబాయి సినిమా లేఖ

చలనచిత్ర నిర్మాతల అధిష్ఠాన మండలి నియమించిన ప్రత్యేకసంఘం నిర్మాతలసంఘానికి సంబంధించిన నియమావళిని తుదిరూపంగా రూపొందిస్తున్నారనీ, ఇది సభ్యుల ఆమోదం పొందడంతో, అధిష్ఠాన మండలి, అస్తవ్యస్తంగా వున్న ఇల్లును చక్కబెట్టుకోడానికి ఉపక్రమిస్తుందని మండలి తాత్కాలికకార్యదర్శి శ్రీ వి. శాంతారాం చెప్పారు.

సర్దుబాటు కావలసిన సమస్యలలో ముఖ్యమైనదీ, మొట్టమొదటిదీ చలనచిత్రాల కథల, పేర్ల సమస్య అని శాంతారాం చెప్పారు. ఈనాడు ఒకేకథను ఇద్దరేసి నిర్మాతలు చిత్రాలు తీస్తామని బయలుదేరటం పరిపాటి అవుతున్నట్టు కనబడుతోంది. ఇప్పుడు పేర్లవిషయంలో కూడా ఈ రకం పోటీ మొదలైంది.

బొంబాయిలో ఇప్పుడు "రాహాహాదీకీ లడ్కీ" అనే ఒక్క పేరుతో మూడు చిత్రాలు తయారవుతున్నాయి. ఈ మూడిటిలో, ఒక్క చిత్రం అయినా దెబ్బతినడం తప్పదు. ప్రేక్షకులు, మహాఅయితే రెండు చూసివవ్వగాని, మూడిటినీ పోషిస్తారనుకోవడం పొరపాటు. అందువల్ల ఈ రకం పరిస్థితులు ఏర్పడకుండా, అధిష్ఠాన మండలి కట్టుదిట్టాలు చేయ సంకల్పించింది. ఒకే పేరుతో ఇద్దరునిర్మాతలు చిత్రాలు తీయరాదు. అలాగే ఒకే కథావస్తువును కూడా ఇద్దరు తీసుకోకూడదు. మాటవరసకి అక్బరు కథలో ఏదో ఒక ఘట్టం కథావస్తువుగా ఒకరు నిర్మిస్తున్నప్పుడు, ఇంకే నిర్మాతకూ దాన్ని ముట్టుకునే అధికారం ఉండదు. అయితే, ఆ అక్బరుకథలోనే, మరో ఘట్టం ఏదైనా ఎంచుకొని చిత్రం నిర్మించుకోడానికి అభ్యంతరం ఉండదు. ఆయా నిర్మాతలు తమ చిత్రాల పేర్లనూ, ఈ మండలి కార్యాలయంలో రిజిస్టరు చేయించుకోవలసివుంటుంది.

ఆపైన వారికిపోటీ ప్రమాదం ఉండదు. ఇంకో నిర్మాతఅటువంటి పనికిపూనుకొన్నా నియమవిరుద్ధంగా వారలా చేసినందుకు, డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటరు కూడా ఆ చిత్రాలను తీసుకోకూడదని కోరడం జరుగుతుంది. ఈ నియమం అమలు జరిపించడానికి అధికారం ఇవ్వవలసిందిగా ఈ నిర్మాతల మండలి, భారత ఫిలిం ఫెడరేషన్‌ను కోరగలదని కూడా శ్రీ శాంతారాం చెప్పారు. ఇదేదో సక్రమంగా అమలు జరిగితే, ఆపైన తాము పరిశ్రమకు సంబంధించిన ఇతర సమస్యలను ఎదుర్కోవడానికి సావకాశం కలుగుతుందని ఆయన అన్నారు. ఈనాడు ఫిలిం పరిశ్రమను ప్రభుత్వం ఒక పరిశ్రమగా గుర్తించి వాణిజ్య పరిశ్రమల మంత్రిత్వశాఖ అజ్మా



బుద్ధుని ప్రియశిష్యుడు భిక్షు ఆనంద్ జీవితం ఆధారంగా చేతన్ ఆనంద్ ఇంగ్లీషు, హిందీలలో నిర్మిస్తున్న 'అంజలి' చిత్రంలో శీలా రామాని, నిమ్మీ.

ఋషీ క్రింద ఉంచలేదు. అలాగని, కళగా గురించి విద్యాశాఖకు ఒప్పగించిందా అంటే అదీ లేదు. దీనితో ఏ సంబంధం లేని సమాచార, రేడియో ప్రసార శాఖకు దీన్ని ఒప్పగించారు. ఇదీ పరిస్థితి అన్నారు శ్రీ శాంతారాం."

*    *    *

ఇటీవల విడుదల అయిన చిత్రాలలో పి. యన్. అరోరా, డి. డి. కాశ్యప్‌లు నిర్మించిన 'హలాకూ' ఒకటి. చెంఘిజ్ ఖాన్ మనుమడైన హలాకు పర్షియా పై చేసిన దండయాత్రను ఇందులో చిత్రించ ప్రయత్నించారు.

ఈ చిత్రీకరణను, కథకు నిర్మాతలు కొత్తగా తగిలించిన కథను చరిత్ర చదువుకున్నవారు ఆమోదించకపోవచ్చును. అయితే ఇందులో చరిత్రను చిత్రించడం వీరి లక్ష్యం కాదు. రోమియో జూలియట్‌ల గాథ తరహాలో ఒక కథని చూపించడానికి ఈ చరిత్రను ఆధారం చేసుకున్నారు. నాయికా నాయకులు మీనాకుమారి అజిత్‌లు ప్రేమించుకొని, లైలామజ్నుల లాగే జూలియెట్ రోమియోల లాగే బాధలు పడతారు, నిట్టూరుస్తారు, ఆ పైన పాటలు, విడివిడిగానూ, జమిలిగానూ కూడా పాడుతారు. వీళ్ళ జీవితం పాలిట విలన్‌గా హలాకును ప్రవేశపెడతారు. అదీ కథ ఏర్పాటు. నటనలో దాదాపు అంతా ప్రశంస లందుకుంటారు. అందరిలోను హలాకుగా ప్రాణ్ నటన ఉత్తమంగా ఉంది. కృత్రిమంగా కనబడే భూమికలను లోపం లేకుండా పోషించడానికి మీనాకుమారి, అజిత్ శాయశక్తులా ప్రయత్నం చేశారు. స్త్రీలలో మంచి నటన ప్రదర్శించిన హలాకూ రాణి భూమిక నిర్వహించినది వీణ. మీనాకుమారి, మినూ ముంతాజ్‌ల నృత్యాలు చక్కగా ఉన్నాయి.

పుష్పా పిక్చర్స్ నిర్మించిన "ఇన్‌స్పెక్టర్" చిత్రం మే మొదటివారంలో ఇక్కడ విడుదలయింది. ఉద్యోగ ధర్మానికీ, రాగద్వేషాలకీ జరిగే సంఘర్షణ ఈ చిత్రానికి కథావస్తువు. ఇందులో ముఖ్య భూమికను అశోక్‌కుమార్ నిర్వహించాడు. గీతాబాలి, కె. ఎన్. సింగ్, ప్రాణ్, అదల, నజీర్ హుసేన్, మారుతీ ప్రభృతులు ఇతర నటీనటులు. దర్శకుడు శక్తి సమంతా. సంగీతం హేమంతకుమార్. కథ, దర్శకత్వం, నటన, సంగీతం మొదలైన అంశాలన్నీ ఈ చిత్రంలో ప్రశంసనీయంగా ఉన్నాయి.

ఎన్. సి. ఫిలింస్ మొన్న విడుదల చేసిన చిత్రం "రాజధాని" ఏవిధంగాను ఏ విషయంలోను చెప్పుకోతగ్గ స్థాయిని అందుకోలేదు. ఎక్కడా కొత్తదనం లేదు. నరవ్ సైగల్ దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో దుర్గాఖోటే, నిమ్మీ, సునీల్‌దత్,



## బొంబాయి సినిమా లేఖ

ఎస్. నజీర్, జానీవాకర్ నటించారు. హన్సరాజ్ బెహల్ సంగీతం కూర్చారు.

* * *

గోల్డెన్ పిక్చర్ వారి "సజన్" త్వరలో విడుదల కాబోతుంది. సుప్రసిద్ధ మహారాష్ట్ర నవలా రచయిత నారాయణ్ హరి ఆప్టే దీనికి కథ వ్రాశారు. డొంక తిరుగుళ్లు లేకుండా, మనోహరమైన పద్ధతిలో, ఇద్దరు స్త్రీల మనస్తత్వాలను అద్భుతంగా చిత్రించే ఈ కథలో ముఖ్యపాత్రలను సులోచనా, లలితా పావర్ నిర్వహించారు. గోప్, సప్రూ, మారుతి, అనూప్‌కుమార్ ఇతర నటీనటులు. దర్శకుడు వసంత్ పెయింటర్ - సంగీతం సుధీర్ ఫడ్కే.

* * *

ఎస్. పి. ఫిలింస్ వారి కొత్త చిత్రం "చెంగిజ్ ఖాన్"కు ఈమధ్య కర్దార్ స్టుడియోలో ప్రారంభోత్సవం జరిగింది. ఈ చిత్రంలో చెంగిజ్ ఖాన్ భూమికను షేక్ ముఖ్తార్ నిర్వహిస్తున్నారు. ప్రేమ్‌నాథ్, బీనారాయ్, జానీవాకర్, తివారి, జీవన్, లీలామిశ్రా, రమేశ్ ఠాకూర్ మొదలైనవారు ఇతర నటీనటులు. సంగీతం హన్సరాజ్ బెహల్ దర్శకత్వం కేదార్ కపూర్.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

* * *

## దక్షిణభారత ఫిలిం వాణిజ్య మండలి

దక్షిణ భారత ఫిలిం వాణిజ్య మండలి 17 వ వార్షిక సర్వసభ్య సమావేశం మే 27న మండలి కార్యాలయంలో జరిగింది. ఈ క్రిందివారితో కొత్త సంవత్సరానికి పాలక వర్గాన్ని ఎన్నుకున్నారు:

అధ్యక్షుడు శ్రీ టి. ఆర్. సుందరం (మాడర్న్ థియేటర్స్), ఉపాధ్యక్షుడు శ్రీ జి. కె. మంగరాజు (ప్రూరా పిక్చర్స్), కార్యదర్శులు శ్రీ పి. రామకృష్ణారావు (భరణి), శ్రీ డి. రామానుజం (ప్రకాశ్ టాకీస్), కోశాధికారి శ్రీ కె. యస్. నారాయణ అయ్యంగార్ (నారాయణ్ అండ్ కో.)

జైరామ్ ప్రొడక్షన్సువారి "టౌన్ బస్" తెలుగుచిత్రంలో కండక్టరుగా అంజలీ దేవి.

కార్యవర్గం : శ్రీయుతులు ఎస్. ఎస్. వాసన్, కె. బి. నాగభూషణం, ఎ. రామయ్య, వి. సి. సుబ్రహ్మణ్యం, ఎన్. ఆర్. శ్రీనివాసన్, బి. ఎన్. గుప్తా, వి. శ్రీనివాసన్, సుందర్‌లాల్ నహాతా, టి. వి. ఎస్. మణి, వి. సుబ్రహ్మణ్య అయ్యర్, డి. సత్యనారాయణ, టి. వెంకటపతి రావు, కె. విశ్వనాథన్, మజీద్ ఎ. కె. కాజీ, జి. రామస్వామి, కె. సుబ్రహ్మణ్యం, కె. వెంకటరామన్.

1955-56 సంవత్సరానికి మండలి కార్యదర్శులు శ్రీ బి. నాగిరెడ్డి, శ్రీ డి. కెంపరాజ్ లు నివేదికను సమర్పిస్తూ మండలి కార్యకలాపాలను వివరించారు. సభ్యుల సంఖ్య గత సంవత్సరం 268 ఉన్నది 296 కు పెరిగిందని పేర్కొన్నారు.

* * *

# దర్శకుడు ఆర్. ప్రకాష్ మృతి

ప్రసిద్ధ తెలుగు సినీదర్శకుడు శ్రీ ఆర్. ప్రకాశ్ మే 28 వ తేదీ రాత్రి ఒంటి గంటకు త్యాగరాజనగర్‌లోని తమ స్వగృహంలో మృతిచెందారని తెలుపుటకు చింతిస్తున్నాము. ప్రకాష్ గారు కొంతకాలంగా అస్వస్థతతో తీసుకొంటూ వచ్చారు. ఆయన వయసు 54 సం॥లు.

ఈయన తండ్రి కీ॥ శే॥ ఆర్. వెంకయ్యగారు ఛాయాగ్రహణంలో మంచిపేరు గడించుకొన్నారు. అప్పట్లో ఆయన మద్రాసులో రెండు మూడు సినిమా థియేటర్లు కూడా నడుపుతూ ఉండేవారు. ప్రకాశ్ గారిని ఆయన చిన్నతనంలోనే చలనచిత్ర కళలో శిక్షణకై లండన్ పంపారు. ఆ తరవాత ఆయన హాలీవుడ్ కూడా వెళ్ళి ఆరేళ్లు అక్కడ ఉండి అనుభవం గడించారు. బొంబాయి వచ్చిన తరువాత, దాదాపు రెండువందల మూకీ చిత్రాలు తీశారు. ఆ దరిమిలా మద్రాసుకు వచ్చి, టాకీ పరిశ్రమలో ప్రవేశించారు. ప్రకాష్ గారి దర్శకత్వాన తయారైన తొలి టాకీ తమిళ చిత్రం వళ్ళి. దరిమిలా ఆయన అనేక తమిళ చిత్రాలకు, కొన్ని తెలుగు చిత్రాలకూ దర్శకుడుగా పనిచేశారు.

కొద్దికాలం క్రితం మీర్జాపురం రాజావారి చిత్రం "దాంపత్యం"కు దర్శకుడుగా బుక్ అయినా అస్వస్థతవల్ల విరమించ



ప్రముఖ చిత్రదర్శకులు
కీ. శే. ఆర్. ప్రకాష్

ఆర్. కె. ఫిలింస్‌వారి "జాగ్‌తే రహో"లో
పహారీసన్యాల్, బుధూ అద్వానీ.



హాఫీజ్ ఇందూర్ దర్శకత్వాన తయారైన హాస్యచిత్రం “మిస్టర్ మస్త్రం”లో కొత్తనటి ఇందిర, పాతనటుడు కరన్‌దివాన్.

# “వదినెగారి గాజులు”

## చిత్రనిర్మాతకు సన్మానం

గత సంవత్సరం ఆంధ్రలో విజయవంతంగా నడిచిన “వదినెగారి గాజులు” చిత్రం నిర్మించిన గోకుల్ పిక్చర్స్‌కు, మద్రాసులోని “జయా ఆర్ట్స్” అనే లలితకళాకేంద్రం వారు జూన్ 3 ఆదివారం నాడు సన్మానం చేశారు. సుప్రసిద్ధ నటుడు శ్రీ ముదిగొండ లింగమూర్తి అధ్యక్షతన పారగన్ టాకీస్‌లో జరిగిన ఈ సభలో, ఆంధ్ర శాసన సభ్యుడు శ్రీ మేకా రంగయ్యప్పారావు ‘జయా ఆర్ట్స్’ తరఫున ఒక రజత ఫలకాన్ని గోకుల్ పిక్చర్స్ అధిపతి శ్రీ కృష్ణమూర్తికి బహూకరించి గౌరవించారు. అధ్యక్షులు శ్రీ లింగమూర్తి మాట్లాడుతూ, కళాకారులకు ఆనందం కలిగేది, తమ కళను ప్రజలు అర్థం చేసుకుని, హర్షించి, ఆదరించినప్పుడేనని, ఇప్పుడు ఈ చిత్రనిర్మాణ సంస్థను గౌరవించడం, ఈ చిత్రంలో పాల్గొన్న వారందరినీ గౌరవించడమేనని, అన్నారు. ఇటువంటి కళానిలయాలూ, ఇతర ప్రజాసంస్థలూ ముందుకు వచ్చి, మన కళల వికాసానికి దోహదం చేయడం అవసరమని శ్రీ లింగమూర్తి చెప్పారు. అనంతరం శ్రీ లింగమూర్తి, ఈ చిత్రం దర్శకుడు శ్రీ సబ్నవీస్ రజనీకాంత్‌ను సభికులకు పరిచయం చేశారు. శ్రీ రజనీకాంత్, ఈ చిత్రంలో పాల్గొన్న కళాకారుల, టెక్నీషియన్ల తరఫున ‘జయా ఆర్ట్స్’కు, ఆ సంస్థ స్థాపకుడు శ్రీ టి. బి. చక్రపాణికీ అభివందనలర్పించారు.

ఈ సందర్భంలో “వదినెగారి గాజులు” చిత్రాన్ని ప్రదర్శించారు. అంజలి, అమర్‌నాథ్, జమున, చలం, ఛాయాదేవి, చదలవాడ కుటుంబరావు, మాస్టర్ వర్మ ఇందులో నటించారు.



## ఆర్. ప్రకాశ్ మృతి

...న్నారు. దరిమిలా, శ్రీ ఎం. హెచ్. ఎం. మూనాస్ ఆరు భాషలలో నిర్మించ తలపెట్టిన “దేవసుందరి” చిత్రం తమిళ్, తెలుగు వెర్షన్‌లకు దర్శకత్వం స్వీకరించడం జరిగింది.

★




ఈ మధ్యనే “శ్రీమతి 420”గా కనబడ్డ మీనాషోరీ పాకిస్తాన్ తరలి వెళ్లింది.

# పరిక్షి నరి

“చెప్పవమ్మా శారదా! - నీ బంగారు పలుకుకోసం నీ మొగుడెలా నిలబడిపోయాడో చూడు!” అంది పొరుగింటి పార్వతమ్మ.

“చెప్పవే!-నిన్న మొన్నటిదాకా నీతో ఆడుకుంటూ వుండే ప్రకాశమేకదూ?--ఎందుకలా సిగ్గుపడతావ్?” అంది అక్క జానకి.

“చెప్పుతల్లీ! - చూడు! — అంతా ఎలా నిల్చుండిపోయారో?- మన ప్రకాశం పేరు చెప్పడానికి అంత సిగ్గెందుకు?” అంది తల్లి కాంతమ్మ బుజ్జగింపుగా కూతురి తల నిమురుతూ.

..మంగళసూత్రధారణ అయిపోయిన అనంతరం వధూవరులను విడిదిలోనికి తీసుకు వచ్చారు. విడిదిలోనికి వెళ్ళేముందు తలుపుల దగ్గర వధువు పేరు వరుడు, వరుని పేరు వధువు చెప్పాలి!

వధువు పేరు అడగడమే తడవుగా వరుడు, ‘శారదా రాణి’ అని చెప్పేశాడు. ఇంక వధువువంతు వచ్చింది...అక్కడే వచ్చింది చిక్కు!-ఆమె నోటినుంచీ ఆమాట రావడం లేదు. దానితో పెండికుమారుడు, పెండ్లికుమార్తె సహితంగా వచ్చిన పెళ్ళివారంతా ద్వారం ముందు ఆగిపోయారు. వరుని పేరు వధువు చెబితేనే కాని వారిని లోనికి తీసుకు వెళ్ళడానికి వీలు లేదు. ఇంకా విడిదిలో చేయవలసిన వేడుకలు చాలా వున్నయ్. పావుగంట గడిచింది. పెళ్ళికుమార్తె పెళ్ళికుమారుని పేరు చెప్పలేదు.

“చెపవమ్మా కోపలా! - ఇప్పుడే ఇంత గయ్యాళివై నిల్చోపెట్టావ్ నావాడిని! - ముందుముందు మరెంత గయ్యాళి వవుతావో?” అంది అత్తగారు రాజేశ్వరమ్మ నవ్వుతూ.

అమ్మో! - ఈపిల్ల సామాన్యమైనది కాద్రోయ్!-మొగుణ్ణి నిల్చోపెట్టే శక్తివంతురాలు!” అంది పెద్దాడపడుచు విశాలాక్షమ్మ

“పిల్ల ఇంత గయ్యాళిదని తెలిసే చేసుకొనేవారంకామమ్మా! - ఈవిడతో మా తమ్ముడు వేగలేడు!” అంది చిన్నాడపడుచు కామేశ్వరమ్మ హాస్యంగా.

అందరి మాటలు వింటూ సిగ్గుతో ఎర్రబారినముఖాన్ని వంచుకుని అలాగే నిల్చుండిపోయింది పెళ్ళికూతురు శారద. ఆమెతోపాటే నిల్చుండిపోయాడు పెళ్ళికొడుకు ప్రకాశం. వారిద్దరితో కూడా వచ్చిన ముత్తయిదువులంతా ద్వారంవద్ద ఆగిపోయారు.

“చెప్పమ్మా!-ఎందుకంత సిగ్గు?” అంది తల్లి.

“మనముందరే ఆ సిగ్గు!...ఓ!-ఇలాంటి వాళ్ళని చాలామందిని చూశాం!”అంది పొరుగింటి పార్వతమ్మ.

## పంతుల కృష్ణారావు

“దానికిమాత్రం మాటాడాలని లేదా యేమిటి?-కొంచెం ఆపెళ్ళికూతురు సిగ్గు చూపించకపోతే బాగుండదు కదా అని చూపిస్తోంది కాని!” ఎదురింటి సీతమ్మ.

“చాలమ్మా నీ సిగ్గు! - అరగంటసేపు చూపించావుగా? ఇంక చెప్పు!” అంది ఒదిన నాగరత్నం

శారద తలవంచుకునే ముసిముసిగా నవ్వింది

“అబ్బో!-నవ్వుతోంది!”అంది చిన్నాడపడుచు కామేశ్వరమ్మ.

“మరేమిటనుకున్నారు ‘నేనేకదా మొగుణ్ణింతసేపు నిల్చోపెట్టేను’ అని నవ్వుతోంది గొప్పగా.”, పెద్దాడపడుచు విశాలాక్షమ్మ అంది.

“ఒక్క మొగుణ్ణేకాదు; మిమ్మల్నందరినీ కూడా ‘ఖబేరావ్’ అని నిల్చోపెట్టగలదు మాశారద!” అంది ఒదినగారు నాగరత్నం.

“అమ్మ బాబోయ్! - ఇలాటిదై తేమా కక్కర్లేదు!” అంది చిన్నాడపడుచు హాస్యంగా.

ఇంతలోకి పెళ్ళిపెద్ద మాధవరావుగారు వచ్చి “ఇంకా అక్కడే నిల్చున్నారా?” అని అడిగారు.

“మీకోసమే ఏపనీ కాకుండా నిల్చోపెట్టేస్తున్నది” అంది రాజేశ్వరమ్మ.

“ఇదిగో, భోజనాలు కూడా ఇంకా కావాలి!-చాలా పనులున్నయ్ వేగం చెప్పమ్మా!” అంది కాంతమ్మ.

“చెప్పవే!-చెప్తావా? మీ మామగారిని పిలవమంటావా?” అంది రాజేశ్వరమ్మ.

“మాశారదకి మామగారంటే భయమా ఏమిటి?” అంది నాగరత్నం.

“చెప్పు తల్లి!-ఇంతసేపు ఇక్కడ నిల్చుంటే మరి భోజనా లెప్పుడవుతాయి?-ఊరేగింపు ఎప్పుడవుతుంది?” అంది తల్లి.

కాని పెళ్ళికూతురు మాత్రం మాటాడ లేదు.

“అబ్బ!-బతిమాలుతున్న కొద్దీ మురిపిస్తోందమ్మా పిల్ల!”అంది చిన్నాడబడుచు కోపంగా.

“అదిగో, చూసావా మీ ఆడబడుచుకి కోపం వచ్చేసింది. ఇప్పుడే చెప్పు!” అంది అక్కగారు.

“కోపగించుకోనక్కర్లేదమ్మా! మాశారద చెప్పేస్తుంది!” అంది పార్వతమ్మ.

“ఏం శారదా చెప్పమ్మా!” అంది సీతమ్మ.

శారద సిగుతో తలవంచేసుకొని ముసిముసి నవ్వులు నవ్వుతూ ‘ప్రకాశరావు’ అంది సన్నని స్వరంతో.

“హమ్మయ్య!-ఈమాట అనిపించేసరికి ముక్కోటిదేవతలు దిగివచ్చినంతయింది.” అంది పెద్దాడబడుచు నవ్వుతూ.

“మరేమిటనుకున్నారు? మా శారద పలుకు

బంగారం లాంటిది. చవగ్గా దొరకదు!" అంది నాగరత్నం.

"ముత్తెంమీద మహా ఘటికురాలు! అందరినీ అరగంటసేపు నిల్చోపెట్టింది." అంది చిన్నాడబడుచు.

అంతా పకపకనవ్వారు. వధూవరులని విడిదిలోనికి తీసుకువెళ్లారు.

*  *  *

గది విద్యుద్దీపాలతో ప్రకాశిస్తోంది. గదిలో ఒకప్రక్క పెద్ద పందిరిమంచం అందంగా అలంకరించబడివుంది. వేరొక ప్రక్క ఒక వెండిపళ్లెంతో మిఠాయి, పన్నీరుబుడ్డీ, సెంటుసీసా, మల్లె, సంపెంగ పువ్వులదండలు టేబిల్ మీద వున్నయ్. గది గోడలకి రెండువైపులా రెండు నిలువుటద్దాలు ఫోటోలు మనోహరంగా అలంకరించబడివున్నయ్. గదంతా సెంటు, మల్లె సంపెంగ పువ్వులు, అగరువత్తుల పరిమళాలతో నిండిపోయివుంది.



ప్రకాశం మంచం మీద చేరబడి కిటికీలోంచి ఆకాశంలో వెన్నెలలు చిందుతూ పరుగెత్తుతూన్న చందమామ వంక చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. ప్రక్కనే శారద తలుపువద్ద నిల్చునివుంది. కాని ప్రకాశం ఆమె వంక చూడలేదు. అలాగే ఆకాశంవంక చూస్తూ కూర్చున్నాడు.

అరగంట గడిచింది. శారద అలా తలుపువద్ద నిల్చునేవుంది. ప్రకాశం అలాగ మంచం మీద కూర్చునే వున్నాడు. శారద భర్త వంక చూసింది. అతను ఏమీ తనకి సంబంధం లేనట్టు ఇంకా అలాగే కూర్చొనివున్నాడు.

శారద ఇంక వూరుకుంటే లాభం లేదనుకుంది. భర్త దృష్టిని తనవేపు త్రిప్పడానికి తను వున్నట్టుగా అతనికి గుర్తు చేయడానికీ అని కొంచెం దగ్గింది. ప్రకాశం దృష్టిని ఒక నిముషం ఆమెమీద ప్రసారించి మళ్లీ ఆకాశంమీదకు మళ్ళించి యథాప్రకారంగా కూర్చొనివున్నాడు.

శారద ఖిన్నురాలైంది. ముఖం వివర్ణమైంది. ఎంతో బాధపడింది. లోలోపల నుంచి దుఃఖం పొంగుకు రాసాగింది. ఆ రాత్రిని ఎంతో మధురంగా ఊహించుకుంది. ఏమిటేమిటో కలలుకంది. కాని భర్త ఇలా ప్రవర్తించడంతో ఆ కలలన్నీ కల్లగా మారుతాయేమో ననిపించిం దామెకు.

మరో పదినిముషాలు అతలుపువద్ద నిల్చొని చూసింది శారద. కాని ప్రకాశం కదలకుండా కూర్చున్నాడు. భర్తవచ్చి తీసుకువెళతాడన్న ఆశ శారదకిపోయింది. ఇంక మరోదారి తోచక తనే భర్త కూర్చున్నదగ్గరకు వెళ్లి నిల్చుంది.

అప్పటికీ ప్రకాశం ఆమెవంక చూడలేదు... శారద ఆలోచించింది... పాలగ్లాసు తెచ్చి నోటి కందించింది.... అత నదోకలాగ చూచి ప్రక్కకు త్రోసేశాడు.

శారద చాలా ఆందోళన పడింది. 'ఏమండీ!' అని పిలిచింది. భర్త పలుకలేదు. శారద నిట్టూర్పు విడిచింది తలవంచుకొని నేలవంక చూస్తూ నిల్చుంది. ఆమెకేమీ తోచడంలేదు.

"ఇటు చూడరూ?" అంది శారద మళ్లీ. అతనుదృష్టి మళ్లించలేదు. శారద చాలా బాధపడింది. ఆమెకు భర్త ప్రవర్తనేమీ అర్థంకాలేదు. దుఃఖం పొర్లుకు రాసాగిందతని ప్రవర్తనకి. నేత్రాంచలాల్నుంచి అశ్రువులు ప్రవహింపసాగినయ్. "నే నేం నేరం చేశానో చెప్పండి!" అంది రుద్ధకంఠంతో.

"ఏమీ లేదు!" ఆమెవంక చూడకుండానే ఆకాశంవంక చూస్తూ సమాధానమిచ్చాడు ప్రకాశం.

"మరయితే నన్నెందు కిట్లా బాధిస్తున్నారు?"

ప్రకాశం మాటాడలేదు.

"ఇట్లా ప్రవర్తించి నన్ను హింసించడంలో మీ ఉద్దేశ్య మేమిటో చెప్పండి!"

"ఏ ఉద్దేశ్యమూ లేదు!"

"అయితే అనవసరంగా నన్నెందు కిట్లా బాధిస్తున్నారు?"

"............"

"నేను బాధపడడమే మీ కానందమా?"

"............"

"నన్ను పెళ్లాడి ఇట్లా కష్టపెట్టడం న్యాయమేనా మీకు?"

భర్త పలుకలేదు.

శారద ఇంకా ఆవేశంతో ఏదో అంటోంది. ప్రకాశం ఇంకా చూస్తూ ఊరుకుండలేకపోయాడు. ఒకసారి నవ్వి, లేచి, తలుపుదగర నిల్చొని ముఖం చేతులతో కప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తూన్న శారద వద్దకు వెళ్ళి, చేతులని ముఖంమీదనుంచి తీసి, ముఖాన్ని తనవైపు త్రిప్పుకొని 'పిచ్చిపిల్ల!' అని అన్నాడు మందహాసం చేస్తూ.

శారద అర్థంకాక భర్త కళ్లలోకి చూసింది.

"హుఁ!-ఇంతేనా నీ ధైర్యం?-ఉదయం తలుపులదగ్గర నా పేరు చెప్పకుండా అరగంటసేపు నిల్చోపెట్టావే నన్ను? ఇప్పుడు నే నూరుకుంటా నేమిటి?" అన్నాడు ప్రకాశం చిలిపిగా నవ్వుతూ.

శారద కిప్పుడంతా అర్థమైంది. ఆమె ముఖం ఆనందంతో వికసించింది.

"నిజంగానా?" అని అడిగింది నమ్మలేనట్టుగా.

"లేకపోతే పెళ్లాడి హింసించడానికి నేనంత హృదయంలేనివాడి ననుకొన్నావా శారదా?" అన్నాడు ప్రకాశం.

"మీ రంత అన్యాయం చేస్తారని అనుకోలేదు. కాని కారణం ఏమిటో తెలియక మనస్సంతా అదోలా అయిపోయింది!... అబ్బ!—బలేవారండీ మీరు!-ఏమిటో అనుకొని భయపడి చచ్చాను" అని ఆనందపారవశ్యంతో అంది శారద.

"పోనీ ఇప్పుడు నా పేరు చెప్తావా?" అని అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

"ఇప్పుడు చెప్పడానికేం? - నలుగురిలో అయితే సిగ్గేస్తుందండీ!-అంతా వేళాకోళాలాడుతారు. కావలిస్తే ఇదిగో ఇప్పుడు మీ పేరు చెబుతున్నాను! - ఊఁ! - సరేనా?— మీ పేరూ - ప్రకాశరావు!" అంటూ కిలకిలా నవ్వింది శారద. 



నిర్మలకు
పాఠము...




మాలతియొక్క చిన్ని కుమారుడు మోహన్ ఎల్లప్పుడూ తన ఆటవస్తువులనుక్రిం- దిఅంతస్తులోని ఇంట్లో కిపడవేస్తుంటాడు- నిర్మల ఇంట్లోకి.
పెంకి మోహన్! నీవుమరొక ఆటవస్తువును పడవేశావు!




నిర్మల ఇంట్లో
అప్పుడేకాదు- అతనికి బుద్ధి చెప్పాలి...
మోహన్‌యొక్క ఆటవస్తువుల- ను మాలతికి ఇచ్చివే యగూడదూ?
తరువాత
చూడు! ఇప్పుడు వారొక తువ్వాలను పడవేశారు!
(ఆలోచిస్తున్నది) ఇదిఎంతో శుభ్రంగా వున్నదే! నాకు ఆశ్చర్యంగా వుంది...
మాలతి ఇంట్లో
నిర్మలా! మోహన్‌యొక్క ఆటవస్తువులను నీవు తిరిగి తెచ్చావా!
అవును- మరిమీతువ్వా- లను, కూడా, ఎందుకనగా నిన్నొకటి అడుగ- దలంచాను-




దానిని ఎంతో శుభ్రముగానీవెట్లు ఉతికితివి, నాకు- చెప్పు? నీవుఉతుకు- నప్పుడు బాదుట నేనెప్పుడూవిను- టలేదు.
అయితే, నేనుబాదను, ఎందుకనగానేను సన్‌లైట్ సబ్బును ఉపయోగించు చున్నాను.
బాదుట బట్టలను త్వరగా చిరిగి పోవునట్లు చేయును, ఎందుకనగా అది బట్టల పోగులను తెంచును.
బాదబడిన బట్ట పెద్దదిగా చూపబడినది.




సన్‌లైట్ సబ్బుయొక్క సమృద్ధ యినసురగ బట్టను- బాదకుండానే శుభ్రముగా ఉతుకును. ఆవిధంగా మీ బట్టలు చాలకాలము మన్ను- నట్లు చేయును.
అదినిజం! సన్‌లైట్ బట్టలను బాదకుండానే తెల్లగాను కాంతివంత- ముగాను ఉతుకును ఆవిధంగా బట్టలు చాలకాలము మన్ను- ను మరియు నాకు డబ్బుకూడమిగు లును!
SUNLIGHT SOAP




సన్‌లైట్ సబ్బు
భారతదేశంలో తయారుచేయబడినది
బట్టలు చాలకాలము మన్నునట్లు చేయును
S. 238-X52 TL

# వియ్యం తీర్చిన కయ్యం

జి. రామకృష్ణ

గురుమూర్తి అంత తీవ్రంగా మాట్లాడక పోతే పద్మనాభానికి యింత యిదిగా కోపం వచ్చేదే కాదు. అవును. గురుమూర్తి మాత్రం పట్టుదలకోసం గట్టిగా వాదించవలసివచ్చింది. తీరా పోట్లాటవరకు వచ్చాక వెనక్కి తగ్గటం చిన్నతనమనిపించి మరికొంచెం వుద్రేకంలో మాట్లాడాడు గురుమూర్తి.

పద్మనాభం తన యింటికి దక్షిణవేపున వున్న తీగ తీసివేసి గోడ కట్టించేందుకు సరిగ్గా కొలతలు తీయిస్తున్నాడు. పద్మనాభం ఖాయపరచిన హద్దు తన స్థలంలోకి వచ్చిందంటాడు గురుమూర్తి. చిలికి చిలికి గాలివానగా మారిందన్నట్టు ఈ పేచీ పెద్దదయింది. చివరకు గోడకట్టడం ప్రారంభించేందుకు వీలులేకపోయింది.

ఈవివాదానికి పూర్వం యిద్దరూ మాంచి జోస్తీగా వుంటుండేవారు. 'బావగారూ' అంటే 'బావగారూ!' అని పిలుచుకుంటుండేవారు. ఆడంగులు కూడా 'ఒదినా' 'ఒదినా' అనుకునేవారు. ఈ గొడవ జరిగిన తర్వాత ఆ యింటికీ, యీ ఇంటికీ మాటలు సన్నగిల్లాయి.

పద్మనాభం యీ విషయంలో ప్లీడరు సలహా తీసుకుని ముందు వ్యవహారం జరపడం మంచిదనుకున్నాడు. బొను కెళ్ళి తన పాత ప్లీడరుతో సంప్రదించాలని నిశ్చయించుకున్నాడు. అంతేకాకుండా బొనులో తనకొడుకు రామేశం బి. యే. రెండో సంవత్సరం చదువుతున్నాడు. కొడుకునిచూసి చాలా రోజులయ్యింది. ఒకమారు చూడాలనిపిస్తోందికూడా, రెండూ కలిపి వస్తాయని పద్మనాభం బొను బయులుదేరి వెళ్లాడు.

రామేశం యిదివరకు కాలేజీ హాస్టల్లో వుండేవాడు. కాని అక్కడ అతనికి తగిన సదుపాయంగా లేదు. అందువల్ల వేరే గది తీసుకుని హోటల్లో భోజనం ఏర్పాటు చేసుకున్నాడు. రామేశం యీ గదిలోకి వచ్చింతర్వాత పద్మనాభం రావటం యిదే మొదటిసారి.

తండ్రి తలవనితలంపుగా వచ్చినందుకు రామేశం చాలా సంతోషించాడు. రామేశం ఒకడే సంతానం అవటంవల్ల తల్లి తండ్రు లతన్ని గారాబంగా చూస్తారు. స్నానం భోజనం అయ్యాక సాయంకాలం ... ఆ యింటి లోకి దిగారు. ఆ యిల్లుగలాయన గురుమూర్తికి తోడల్లుడని, ఆయనపేరు డాక్టరు శంకరం అని చెప్పాడు రామేశం. పద్మనాభం మనస్సెందుకో చివుక్కుమంది. తనొచ్చిన పని గురించి రామేశానికింకా చెప్పలేదు. ఇంతలోనే బయటనుంచి శంకరం రామేశాన్ని వుద్దేశించి 'ఏమోయ్! రామేశం, ఎవరో బంధువు లొచ్చారల్లే వుందే' అంటూ గదిలోకి వచ్చాడు. ఒకరికొకరికి పరిచయాలయ్యాయి. శంకరం మహా కలుపుగోలు మనిషి. ఈ యిల్లు క్రొత్తగా కొన్నాడు. ప్రాక్టీసు బాగానే వున్నది. ఇద్దరాడపిల్లలూ, ముగ్గురు మొగపిల్లలూ సంతానం. పెద్దమ్మాయి సరోజిని యీ యేడు స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్లోంది. రామేశం టేబుల్ లైటు 'ఆన్' చేసి చదువు ప్రారంభించాక పెద్దవాళ్ళిద్దరూ యివతలకొచ్చి వసారాలో కూర్చున్నారు కబుర్లకి.

చాలా విషయాలు చర్చించారు. శంకరం రామేశాన్ని బాగా పొగిడాడు. రామేశం కలివిడితనం, అలవాట్లు శంకరానికి బాగా నచ్చాయి. మరో విషయం కూడా శంకరం మనస్సుకు తెలుసు - రామేశం అన్నివిధాలా సరోజినికి నచ్చాడని, సరోజినంటే రామేశానికి నిండు ప్రేమ అని.

గురుమూర్తి విషయం వచ్చినప్పుడు పద్మనాభం నిండుకుండలా వ్యవహరించాడు. పోట్లాటగురించి ఏమాత్రం బయటపడనివ్వలేదు. గురుమూర్తికి సంతానంలేని కారణంచేత సరోజినిని తమవద్ద వుంచుకుంటామని లోగడ గురుమూర్తి దంపతులు శంకరాన్ని చాలాసార్లు అడిగారు. స్కూలుఫైనలు పూర్తయ్యాక పంపుతామని వాగ్దానంచేసిన సంగతి కూడా చెప్పాడు శంకరం.

ఇంతలో సరోజిని వసారాలోకి వచ్చింది. పదిహేను సంవత్సరాల పసిడి బొమ్మ సరోజిని. చక్కటి రూపం. కొత్త మనిషి వుండటంవల్ల తిరిగి లోపలికి పోబోయింది. శంకరం ఆమెను వెనక్కి పిలిచి 'పరవాలేదు రామ్మా! మన రామేశం నాన్నగారే. మరెవరూ కాదులే' అన్నాడు. పద్మనాభం కూడా ఆమెను దగ్గరకు పిల్చాడు. ఆమె అందచందాలుచూసి మురిసిపోయాడు. తన కోడలుగా వుండాలని కలలుగనేరూపం సరోజినిలో చూశాడు. ఆ క్షణంలో ఎన్నెన్నో భావసౌధాలు కట్టాడు. గురుమూర్తిమీద వున్న కోపం ఎందువల్లో మర్చిపోయాడు. 'ఏం చదువుతున్నావమ్మా!' అని సరోజినిని పలకరించాడు. 'స్కూలు ఫైనలు చదువుతున్నానండీ' అంది సవినయంగా. సరోజిని తిరిగి యింట్లోకి వెళ్ళిపోయింది. పద్మనాభం ఆమె వెళ్లినవైపే చూస్తున్నాడు. తిరిగి ఊహాపథంలోకి వెళ్ళాడు. తన కొడుకు రామేశానికి ఇరవయ్యో సంవత్సరం రాబోతోంది మరో పదిరోజుల్లో. త్వరలో ఒక యింటివాడిని చేసి ముద్దుముచ్చట్లుచూడాలని తల్లి అప్పుడేచాలాసార్లు గుర్తుచేసింది. రామేశానికి నచ్చిన పిల్లని వాడికి చెయ్యాలి. అయితే వాడి అభిరుచు లెలా వుంటాయో? సరోజినివంటి లక్ష్మీస్వరూపం గల కోడలు తన నట్టింట తిరుగుతుందా? అయితే తను జీవితంలో అభిలషించేది యింకేమీ వుండదు. ఇలా వూహిస్తూ అప్రయత్నంగా 'సరోజిని ఏ అదృష్టవంతుల యింటి కోడలవుతుందో కదా!' అన్నాడు శంకరంతో. ఆక్షణంలో శంకరంకూడ ఆశాసౌధాలు కడుతున్నాడు. రామేశం తనకన్నివిధాలా నచ్చిన యువకుడు. ఏదో వెనకాల యింత వున్నవాడు. చదువు సంధ్యలు చక్కగా అబ్బాయి. ఇంకా పైకి చదవటానికి తగిన వుపాధి వున్నవాడు. పద్మనాభం అన్నమాటకు పరధ్యానంగా 'ఆ అదృష్టవంతులు మీరే కాకూడదా?' అన్నాడు. పద్మనాభం సంతోషంలో తగిన ప్రత్యుత్తరం యివ్వలేక నవ్వి వూరుకున్నాడు.

మరి కాసేపు మాట్లాడుకుని లోపలికి వెళ్లిపోయారు.

మర్నాడు పద్మనాభం శంకరం యింట్లో అతిథిమర్యాదలు పొందాడు.

ప్రస్తుతానికి గురుమూర్తిమీద ఎట్టి వ్యవహారం జరపటానికి పద్మనాభానికి మనస్కరించలేదు. ఒకరోజు కొడుకుదగ్గర వుండి తిరిగి యింటికి బయలుదేరాడు. పద్మనాభం వెళ్తున్నానని చెప్పటానికి రాగా శంకరం 'త్వరలో మీ యింటిదగ్గరే మిమ్మల్ని కలుసుకుంటా' మన్నాడు.

రామేశం పట్టుదలతో చదువుతున్నాడు. అసలు తెలివితేటలున్నవాడు. సరోజిని కూడా బాగా చదువుతోంది, మంచి మార్కులు సంపాదించాలని. పరీక్షలు సక్రమంగా పూర్తయ్యాయి. రామేశం అన్ని పేపర్లు చాలా బాగా వ్రాశాడు. గ్రూపులో ఫస్టు క్లాసు వస్తుందనే ధైర్యం పొందాడు. సరోజినికూడా నిస్సందేహంగా పాసవుతానని నమ్ముతోంది.

రామేశానికి పరీక్ష లవటంతో టౌనులో కాలేజీచదువు పూర్తయినట్టే. స్వగ్రామం వెళ్ళిపోయేందుకు నిర్ణయించుకున్నాడు.

సరోజినిని వదలి వెళ్లిపోతున్నందుకు మొదట్లో చాలా విచారించాడు రామేశం. కాని తానుకూడ తన పెత్తండ్రి గురుమూర్తి యింటికి రానున్న సంగతి సరోజిని చెప్పాక రామేశం అమితానందం పొందాడు. అందరి దగ్గర సెలవు తీసుకుని రామేశం స్వగ్రామం చేరుకున్నాడు.

రామేశానికి, తనతండ్రికి గురుమూర్తికి జరిగిన పోట్లాటగురించి ఏమీ తెలియదు. అందువల్ల మామూలుగా గురుమూర్తిని 'మామయ్యా' అంటూ తరచు పలకరిస్తూనే వుంటున్నాడు. గురుమూర్తికూడ కలుపుగోలుమనిషి; మెత్తనైనవాడు. రామేశం వచ్చాక పద్మనాభంమీద వుండే కోపం దాదాపు పూర్తిగా తగ్గిపోయింది.

ఒకమారు మాటలవరుసలో రామేశం తాను టౌనులో వున్నప్పటి వివరాలు చెప్తూ, శంకరం ప్రసక్తి తెచ్చాడు. ఈ వార్త విని గురుమూర్తి బ్రహ్మానందం పొందాడు. తన ప్రయత్నాలకి అప్పుడే జయం కలిగినట్టు భావించాడు.

మరో వారంరోజులకు శంకరం, భార్యాపిల్లలతోసహా గురుమూర్తి యింటికి వచ్చాడు. వాళ్ళువచ్చాక పద్మనాభం, గురుమూర్తి యిళ్లమధ్య రాకపోకలు తిరిగి సాగాయి. సరోజిని తరచువచ్చి పద్మనాభం భార్యతో కబుర్లు చెప్తూ ఉంటుంది. సరోజినితో మాట్లాడటమంటే పద్మనాభం భార్యకు మహాసంతోషం.

మంచితిథి చూచి వుదయానే గురుమూర్తి, భార్య, శంకరం, భార్య పద్మనాభం యింటికి వచ్చారు. ఆ మాటా యీ మాటా అయ్యాక గురుమూర్తి అన్నాడు: "పద్మనాభం బావా! చల్లకొచ్చి ముంతదాయటమెందుకు, అంతా తెలిసినవాడివి. వేరే చెప్పనవసరంలేదు. నావల్ల లోగడ తప్పు జరిగితే అది మనస్సులో పెట్టుకోవద్దు. నేను నా మరదలుకూతురు సరోజిన్ని పెంచుకోవాలని, అచ్చటా ముచ్చటా తీర్చుకోవాలని అనుకుంటున్నా. మీ చెల్లెలేమో 'మొగపిల్లవాడెని వద్దు ఆడపిల్లనే పెంచుకుందాం' అని పట్టుపట్టింది. సరే అన్నా. పిల్లకు ఈడు వచ్చినదన్న సంగతి నీకు తెలుసు. మన రామేశంకూడ మాకు కొత్తవాడుకాదు. మా ఎదుట పుట్టి పెరిగినవాడు. మా పిల్లని నీ యింటి కోడలుగా చేసుకున్నావంటే బ్రతికున్నంతకాలం మేమిద్దరం సరోజిన్ని రామేశాన్ని చూస్తూ ఆనందించే భాగ్యం కలుగుతుంది.'

పద్మనాభం హృదయంలోనించి చిరునవ్వు నవ్వాడు. 'బావా! నేనిదివరకే ఈమాట అనుకున్నా. అయినా మగపెళ్ళివారం, మహాబెట్టుగా వుండాలి. మరో సంగతి...అసలు వాళ్ళిద్దర్ని 'అడగటం ధర్మం' అంటూ 'రామేశం! ఒకేనాన్నా!' అని కొడుకుని పిల్చాడు. రామేశం రాగానే 'ఏరా! శంకరంగారి అమ్మాయిని నీకిస్తామంటున్నారు, ఏమంటావ్?' అని అడిగాడు. సమాధానంగా చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. ఇంతలో గురుమూర్తిభార్య సరోజినిని అక్కడకు తీసుకువచ్చింది. సరోజని ముఖంలో మందహాసం నృత్యం చేస్తోంది. గురుమూర్తి భార్య "ఏమండోయ్ అన్నయ్యగారూ! మా పిల్లకూడా నవ్వి సమాధానం యిస్తోంది చూడండి" అంది. అందరూ ఫక్కున నవ్వుకున్నారు.

ఆచారంప్రకారం తాంబూలాలు పుచ్చుకున్నారు.

మాఘమాసంలో శుభలగ్నాన వివాహం జరిగింది.

రామేశం బి. యి. ప్యాసయ్యాక డాక్టరు కోర్సు చదివి పట్టా పొందాడు. స్వగ్రామంలోనే డిస్పెన్సరీ ప్రారంభించాడు.

గురుమూర్తి పెద్దవాడై పోయాడు. పద్మనాభం కూడా అరవయస్సువాడు. సరోజిని రామేశం వాళ్ల ఎదుటే వుంటున్నారు. అనేవారు కాంక్షించింది. గురుమూర్తిది, పద్మనాభంది యిప్పుడు ఒకే కుటుంబం. వాళ్ళ యిళ్ళ మధ్య పూర్వంవున్న తీగకూడా లేదు, రెండూ కలిసి ఒకే యిలుగా అయ్యాయి. రామేశానికి యిప్పుడు ఇద్దరు మగపిల్లలు. గురుమూర్తి అప్పుడప్పుడు అంటూవుంటాడు వియ్యంకుడితో: 'ఏం, బావా తురతురా పరుగెత్తావే, ప్లీడరు దగ్గరికి గోడకట్టాలని పట్టుపట్టి...యిప్పు డేమంటావ్...చూడు మనవలు ఆడుకోటానికి ఎంత జాగా వుంది-గోడవుంటే పడగొట్టాలిసివచ్చేది."

పద్మనాభం సమాధానంగా - "ఆ... అందుకు పోయానా బావా! మాకోడల్ని, కొడుకుని చూడటానికి వెళ్లానుగాని. కావాలంటే ఆ ప్లీడర్నడుగు. అయన్ని యీ సంగతి సంప్రదించానేమో ... అంతదాకా ఎందుకు మా రామేశాన్ని అడుగు మన తగాయిదాగురించి వాడికేమైనా చెప్పానేమోనని...సరోజిన్ని చూశాక చల్లకని తీసుకుపోయిన ముంతని దాచేశానంటే నమ్మ బావా!" అని అంటూవుంటాడు. ★




# స్త్రీలకు ఏం కావాలి?

స్త్రీలకు ఏం కావాలి? వారు తెలిసికో తగిన విషయాలేవి? వారి అభిరుచులు ఏ తీరుగా ఉంటాయి?

ఈ ప్రశ్నలకు సమాధానాలు స్థూలదృష్ట్యా ఇలాగు లభించేవి: 'స్త్రీలకు వంటకాలను గురించీ, కుట్టుపనినిగురించీ ఇంటిని చక్కబెట్టుకోవటాన్నిగురించీ చెప్పితే చాలు. వారి అభిరుచులుకూడా అవే కనుక స్త్రీలకు తెలుపవలసిన విషయాలు వీటికి సంబంధించినవే—ఈ మాదిరిగా ఉంటాయి. ఈ విధమయిన సమాధానాలు పురుషులవద్దనుండీ స్త్రీలవద్దనుండీ కూడా నాకు లభిస్తాయి.

'వంటకాలనుగురించి' అన్నప్పుడు బెండకాయలు బీరకాయలు పొట్లకాయలు ఏ విధముగా వండాలో—ఎన్ని రకాలుగా వాటిని వండవచ్చునో మాత్రమే తెలుసుకొంటే చాలునన్న భావము కనబడుతూ ఉంటుంది. నిజానికి ఈ రెండు విషయాలు తెలియని స్త్రీలు ఉంటారా? స్త్రీలకు పుట్టుకతోనే పాకకళ అబ్బుతుందని నా మతం. దీనిప్రకారము అందరు స్త్రీలూ ఈ కళలో నేర్పరులు కాకపోయినా పైపై సూత్రాలయినా తెలియనివారుండరు. అవి కూడా తెలియని స్త్రీలున్నా చెప్పగానే గ్రహించుకోగలిగి వుంటారు. ఆ స్థితిలో కేవలము మామూలుగా వండుకునే కూరలను గురించి చెబితే లాభము యేమిటి? ఆ కూరల తత్వగుణాలు, అవి ఉపయోగించవలసిన కాలాలు, కాలముకానికాలములో వాటివల్ల కలిగే నష్టాలు మొదలయిన అంశాలను గురించి తెలిసికొంటే స్త్రీలకు నిత్యజీవితములో ఉపయోగపడుతాయి. ఈ కూరలు ఒక్కొక్క ప్రాంతములో కొన్నిరకాలు మాత్రమే పండుతాయి. ఏ ప్రాంతములో పండే కూరలను ఆ ప్రాంతీయులే వాటి తత్వాలను గ్రహించి ఉపయోగించుకోగలుగుతారు. మాటవరసకు — పనసకాయ అన్నిప్రాంతాలలో పండదు. ఆ పంట లేనిచోట దాని ఉపయోగము కూడా సరిగా తెలియదు. ఆ ప్రదేశాన్నిబట్టి, వాతావరణాన్ని, అక్కడ పండే ధాన్యాలనూ, కూరలను బట్టి అక్కడి ప్రజల ఆహారమూ ఆచారమూ ఆధారపడి ఉంటాయి. ఈవిధముగా విశ్వవ్యాప్తమయివున్న ప్రజాకోటి ఆహారాన్నిగురించీ, ఆచారాలనుగురించీ, ఆ ప్రదేశాలనుగురించీ, అక్కడి పంటలను గురించీ తెలిసికొంటే బాగుండదూ? వీటిని గురించి తెలిసికోవాలన్న కుతూహలము అందరికీ ఉంటుందే! ఈవిధముగ ఆలోచిస్తే చరిత్ర, భూగోళ శాస్త్రము, ప్రకృతి శాస్త్రాలకు సంబంధించిన అంశాలు బయలుదేరుతున్నాయి. ఆ కూరలు ధాన్యాలు ఏ మనిషికి ఎప్పుడు వాడవలసి ఉంటుందో తెలిసికొని ఉండాలంటే గృహవైద్యము కూడా కొంత తెలిసికొని ఉండాలి.

**ఇల్లిందల సరస్వతీదేవి**

కుట్టుపనినిగురించి స్త్రీలకు చెప్పాలంటే ఏవో రెండు మూడు రకాల కుట్లు తీసుకొని 'వాటినిగురించి చెప్పితేనే మాకిష్టము' అని స్త్రీలు అన్నట్లయితే ఏమీ లాభము ఉండదు. మనకు నిత్యోపయోగములో ఉన్న అన్ని రకాల దుస్తులను గురించీ, వాటి కత్తిరింపులనుగురించీ తెలిసికోవాలి. వాటిని తయారుచేయటము తెలిసికొని ఉండాలి. ఈ కుట్ల ఉపయోగాలు, వాటి ప్రయోజనాలు, వేటిమీద ఏ రకపు కుట్టు బాగుంటుందో - ఏ రంగు బాగుంటుందో— తెలిసికోవాలి. రంగుదారాలను ఉపయోగించటానికి ఏ రంగుదగ్గర ఏ రంగు అందమిస్తుందో తెలుసుకోవాలి. అది ఒక

కళ. ఆ రంగుల కలయికనుగురించి తెలుసుకోనిదే ఆ కళ రాణించదు. ఈ కుట్టుపని స్త్రీల కర్తవ్యంలో ప్రయోజనకరమైనది కనుక ప్రతిస్త్రీకి వచ్చిఉండాలి. ఈ కళను స్త్రీలకు ఎప్పటినుంచీ అభ్యసింపచేయాలి? సంసారము ఏర్పడేముందరే తెలిసికొని ఉండాలంటే బాల్యమునుంచీ అభ్యసించవలసిన కళగా కనబడుతున్నది. బాలికలకు ఈ కళలో ప్రవేశము కలిగించాలంటే బిడ్డల అభిరుచుల కనుగుణముగా—చిత్తాకర్షణీయముగా ఉండే మార్గాలను అన్వేషించి వాటిననుసరించాలి. దీనికిగాను బిడ్డల చిత్తవృత్తులూ వారి అభిరుచులూ ముందుగా తెలిసికోవలసి ఉంటుంది. పిల్లలకు బొమ్మలంటే చాలా యిష్టము. ముఖ్యముగా, ఆడపిల్లలకు బొమ్మలాటలంటే ప్రాణము. ఆ బొమ్మలను ఎత్తుకోవటము, పడుకోబెట్టటము, అన్నమూ నీళ్లూ వేళచొప్పున అమర్చటము, కాళ్లమీద పడుకోబెట్టుకొని నిద్రబుచ్చటము, లాలిపాటలూ జోలపాటలు పాడటము వారి నిత్యకృత్యాలు. బొమ్మలంటే ఇంత ఇష్టముగల పిల్లలకు ఆ బొమ్మలకు వస్త్రాలంకరణ చేయటమంటే ఆనందము. రంగురంగుల బట్టలను చింపి వాటికి కట్టి మురుస్తూ ఉంటారు. కనుక పిల్లలకు కుట్టుపనిలో ప్రవేశము కలిగించాలంటే రమారమి నాలుగవ ఏటనుండే ఆరంభించినా తొందరగా మొదలుపెట్టినట్లనిపించుకోదు. ఆ బొమ్మలకు లాగులు, చొక్కాలు, పరికిణీలు, జాకెట్లు ఏ విధముగా సిద్ధము చేయాలో-ఏరకపు దుస్తులు ఏ రంగులో ఉంటే బాగుంటుందో ఆ వయసునుండే నేర్పితే పిల్లలు చక్కగా కుతూహలముతో అభ్యసించుతారు. పిల్లలకు ఏ విషయాన్ని ఏవిధముగా నేర్పాలో తెలుసుకోవటము అన్నిటికంటె ప్రధానమయినది.

ఈ విధముగానే చేతిపనులు కూడా రకాలవారీగా వివరించి వాటిని తయారుచేయటము బోధించవచ్చు. వాటిలో కూడా పిల్లలకు ప్రవేశము కలిగించగలిగినవి కొన్ని, పెద్దవారికి ప్రవేశము కలిగించవలసినవి కొన్నీ ఉంటాయి.

ఇల్లు చక్కబెట్టటాన్ని గురించి స్త్రీలకు తెలపాలంటే మనము ఏ ఏ విషయాలను గురించి చెప్పవలసి ఉంటుందో చెప్పేవారే ఆలోచించుకోవాలి. ఉదయము లేచినప్పటినుండీ రాత్రి పడుకోబోయేవరకూ నిర్వహింపబడే గృహకృత్యాలనుగురించి చెప్పవచ్చు. గృహానికి కావలసిన వస్తుసామగ్రి-వాటిని ధరచేయటము, వాటి విలువలు, అవి లభించే కాలాలు వాటి ఉపయోగాలు, వాటిని భద్రపరచుకొనే విధాలు-మొదలయినవి స్త్రీలు తెలుసుకోతగినవి. గృహనిర్వహణలో ప్రధానమయినది ఆర్థికప్రసక్తి. కుటుంబాదాయాన్ని బట్టి వ్యయము చేసుకోవాలి. ఆ వ్యయపరచటము కూడా, ఏ విషయానికి ఎంత వ్యయము చేయవలసి ఉంటుందో మితవ్యయము చేయటము సాధ్యమా-మితవ్యయము ఏ విధముగా చేయాలో మొదలయిన అంశాలు స్త్రీలకు అత్యావశ్యకమయినవి. మితవ్యయము చేయటము చేయకపోవటము స్త్రీల చేతిలో ఉండాలంటే డబ్బు చేతిలో మెదలాలి. స్త్రీలచేతికి గృహస్థులు విశ్వాసముతో తమ ఆదాయాన్ని ఇస్తేగాని ఇది సాధ్యము కాదు. పురుషుల విశ్వాసాన్ని-అనగా పెనిమిటి విశ్వాసాన్ని భార్య పొందాలంటే మననూ అనురాగమూ ఇచ్చి పుచ్చుకోవాలి. ఆయన మనస్తత్వాన్ని బాగా గ్రహించాలి. వ్యక్తి స్వభావాన్ని బాగా తెలిసికొనిఉంటే అస్వభావగుణాలను కనిపెట్టి ప్రవర్తించవచ్చు. ప్రతిమనిషి రాక్షసుడుగా పుట్టడు. కొన్ని గుణాలు అట్టువంటివి ఉంటే ఉండవచ్చు. ఇతర మంచి గుణాలతో ఈ గుణాలను మరుగుపరచేటట్టుగాని, వీటి ప్రభావము అధికముకాకుండాగాని ప్రయత్నించి సాధించవచ్చు. లేక ఆ మంచిగుణాలతోనే - వాటిని చూసుకొనే కాలము గడపటము నేర్చుకోవచ్చు. ఇంత పరిశోధనచేసి ఫలితాలను సాధించటానికి ఎంతో ఓపిక-కార్యము సాధించవలెనన్న పట్టుదల ఉండాలి; ఆ గుణాలను మొదట అభ్యసించాలి.

వ్యక్తి పుట్టినదగ్గరనుండి గిట్టేవరకూ స్త్రీతో సంబంధములేకుండా ఉండరు. మాతగా పత్నిగా స్త్రీల బాధ్యత నిర్వచింపరానంత ఘనమైనది. పురుషునికి పౌరుషాన్ని కలిగించేది మాత-వృద్ధిచేసేది పత్ని. ప్రతి స్త్రీ ఈ రెండు ధర్మాలను నిర్వహించవలసే ఉంటుంది. ఈ ధర్మాలను నిర్వహించే దృష్టితో స్త్రీలు బిడ్డలను పెంచాలి. లోకములో ఉన్న మంచీ చెడూ స్త్రీలచేత బిడ్డలకు నేర్పబడినవే. ప్రత్యేకముగా నేర్పకపోయినా ఆ గుణాలు కలగటానికి కొంతవరకూ కారణభూతులవవచ్చు. ఈ అవాంతరాలను దాటటానికి బిడ్డల తత్వాలు, గుణస్వభావాలు వాటిని చక్కదిద్దే మార్గాలు, పిల్లలపట్ల మన ప్రవర్తన వాటి ఫలితాలు-మొదలయిన అంశాలు తెలిసికొనతగిన వాటిలో ప్రధానమైనవి. బిడ్డల ప్రసక్తి వచ్చినప్పుడు వారి విద్యాభ్యాసాన్ని గురించిన అంశాలు రాకమానవు. విద్యాబోధన ఎట్లా ఉండాలి-ఎట్లా వుంటున్నది-ఎట్లా వుంటే బాగుంటుంది-మన దేశములో ఎట్లావున్నది-ఇతర దేశాలలో ఎట్లావున్నది-మనకేది ఆచరణయోగ్యము-ప్రస్తుత పరిస్థితులలో ఎంతవరకూ సాధ్యము-మొదలయినవన్నీ విషయాలు జరుగుతాయి. ఇవికూడా ముఖ్యమయినవే.

పుణ్యమూ పురుషార్థమూ సంపాదించాలనుకొంటే 'ఇదివరలో స్త్రీలు కేవలము వ్రతాలు మాత్రమే ఆచరిస్తూ ఉండేవారు కదా-దానము ధర్మమూ దానిలోనే ఉన్నాయి కదా' అనుకొంటే చాలదు. పుణ్యమూ పురుషార్థమూ మానవసేవలోనే ఇమిడిఉన్నాయి. కనుక ఈ కాలానికి తగిన మానవసేవ చేయటాన్ని గురించీ, జరుగుతున్న మానవసేవనుగురించీ స్త్రీలు తెలుసుకోవాలి.

ఆడది యింట్లో ఉంటే చాలు - ఇంటిని గురించి తెలుసుకొంటేచాలు' అని సామాన్యముగా అనుకుంటారు. 'కట్టె-కొట్టె-తెచ్చె' అంటే వివరించటానికి రామాయణమంతా చదవాలి. అదివిధముగానే ఇంటినిగురించి చెప్పాలంటే చిన్నప్రపంచాన్ని గురించి చెప్పటమన్నమాట. ఈదృష్టితో చూస్తే స్త్రీలు తెలిసికోకూడని విషయాలు ఏముంటాయి?

అన్ని విషయాలు తెలిసికొంటేగాని ఉపయోగపడే అంశాలూ వాటి విలువలూ తెలియవు. స్త్రీలకు అన్ని విషయాలమీద ఆసక్తి ఉండదు. కనుక వారికి ఆసక్తి కలిగిన విషయాలే-అంతవరకే చెప్పాలని చాలామంది భావిస్తారు. ఇది కొంతవరకూ నిజమే అయినా-పోయినంత పొడుగునా అక్షరాలు దిద్దబెట్టేసందువల్ల ఏమి లాభము? అక్షరాల తరువాత మాటలు, తరువాత వాక్యాలు నేర్చుకోవాలనే కదా ఈ క్రమము?

వివిధ విషయాలను పత్రికలలోను రేడియో ప్రసంగాలద్వారాను ఉపన్యాసాలద్వారాను తెలిసికొని, అంతటితోనే నిలిపివేయకుండా, ఆవిషయాలనుగురించి గ్రంథపఠనము వల్ల, కూడా తెలిసికొంటే స్త్రీలకు సమగ్రమయిన జ్ఞానము అలవడుతుంది. ఈదృష్టితోనే స్త్రీలకు సంబంధించిన పత్రికలు, రేడియోప్రసంగాలు గ్రంథాలు సాగిపోవాలి. ★

బాలసాహితి

# మృత్యుంజయుడు

‘నీ ఉద్యోగ పరిమితి అయిపోయింది. నువిప్పుడు నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళి కాలం గడపొచ్చు’ అని చెప్పి పాతిక సంవత్సరాల సర్వీసు నిండిన సిపాయిని సాగనంపారు. సిపాయి మనసులో అనుకున్నాడు, ‘నేను యిరవైఅయిదు సంవత్సరాలు ప్రభువువారి కొలువు చేశాను, కాని అందుకు చిహ్నంగా యిరవైఅయిదు దుంపముక్కలన్నా నాదగ్గర లేవు. మూడు ఎండిపోయిన రొట్టెముక్కలు మాత్రం ప్రయాణంలో కడుపు నింపుకుందుకని యిచ్చారు. ఇప్పుడు నేనేంచేసేట్టు? ...సరే, యింటికి వెడతాను, తల్లీ దండ్రీ ఎట్లా వున్నారో - వాళ్ళను కనిపెట్టుకునుంటాను, ఒకవేళ కర్మవశాత్తూ వాళ్లు చనిపోయినట్లయితే కాస్సేపు వాళ్ళ సమాధిపక్కనే కూర్చుని మనశ్శాంతి పొందుతాను—’

ఇట్లా అనుకుని సిపాయి యింటి ముఖం పట్టాడు. నడిచాడు, నడిచాడు—రెండు రొట్టెముక్కలు తినేశాడు. వెళ్ళవలసిన దూరమయితే చాలానే వుంది. దారిలో బిచ్చగాడు కలిశాడు. ‘ఈ కుంటివాడికి తినటాని కేమన్నా పెడతావా, సిపాయి భాయీ’ అనడిగాడు. సిపాయి తన దగ్గర మిగిలున్న మూడో రొట్టెముక్క ఆ ముసలి బిచ్చగాడికిచ్చేసి ‘నేనెట్లాగో తంటాలు పడతాను. సిపాయివాడు యేదో మార్గాన తనను పోషించుకోగలడు, కాని యీ ముసలి - కుంటి బిచ్చగాడి మాటేమిటి?’ అనుకున్నాడు.

పైపు ముట్టించి పొగవదులుతూ బయలుదేరాడు. నడవగా నడవగా ఒక కొలను అడ్డు వచ్చింది. కొలను గట్టున బాతులు విచ్చలవిడిగా తిరుగుతున్నాయి. సిపాయి యెక్కుపెట్టి, మూడు బాతుల్ని చంపాడు. వాటిని పుచ్చుకుని రోడ్డంటే నడిచి పట్టణం చేరుకున్నాడు. ఒక సత్రం దగ్గర ఆగి, యజమానిని పిలిచాడు: ‘యిదుగో, మూడు బాతులు, బాగా

‘విరించి’

వేయించి నా కొకటి వెయ్యి, నీ శ్రమకి నువ్వొకటి తీసుకో, నాకు భోజనంలోకి సారాయం సప్లయి చేసేందుకు నీకు మూడోది’ అన్నాడు. భోజనం తయారయేంతవరకూ తన మూట పరుచుకు అరుగుమీద పడుకున్నాడు సిపాయి. ఒక గుక్కెడు సారాయం, ఒక ముక్క వేగిన బాతుమాంసం- ఆహా! యేం రుచి...ఫరవాలేదు, అనుకున్నాడు. తిరుబడిగా భోజనం చేస్తూ, సత్రపు మనిషిని అడిగాడు ‘అదిగో, ఎదురుగా ఆ వీథిలో మేడ ఎవరిది నాయనా?’

‘ఈ వూరికల్లా ధనికుడైన షాహుకారు ఆ మేడ తనకోసమే కట్టుకున్నాడు. కాని - దాన్లో వుందామని ఎంత కోరిగ్గా వుందో, అంతగా అతను దాన్లోకి పోలేడు’

‘యేమి? ఎందుచేతా?’

‘ఆ మేడలో దుష్టశక్తు లున్నవట! దెయ్యాలూ, భూతాలూ, పిశాచాలూ - బ్రహ్మరాక్షసులూను! రాత్రుల్లు అవి ఆ కొంపలో నానాగోలా చేస్తాయి. చీకటిపడ్డాక ఆ చాయలకు వెళ్ళటానికే జనం హడిలిపోతారు!’

సిపాయి - ఆ షాహుకారు యిల్లెక్కడో కనుక్కున్నాడు. ‘వెళ్ళి ఓమాట మాట్లాడతాను. యీ విషయంలో అతనికి సహాయపడగలనేమో!’ అనుకున్నాడు.

భోజనానంతరం అతను కాసేపు కునుకుపాట్లు పడ్డాడు. చీకటి పడుతూండగా, బజారుకు బయల్దేరి, షావుకార్ని కలుసుకున్నాడు: ‘నేనో ప్రయాణికుడిని, మీ కొత్త యిల్లు కాళీగా వున్నదని విన్నాను. దాన్లో యీ రాత్రి గడుపుకుందుకు అనుమతించండి’ అనడిగాడు.

షావుకారు ‘నీ కేమన్నా మతి చలించిందా యేమిటయ్యా! లేక జీవితమంటే విరక్తి పుట్టిందా? యీ వూళ్ళో వెయ్యి కొంపలున్నాయి, యింకెక్కడన్నా ఆశ్రయం చూచుకో. నా కొత్తకొంపనిండా పిశాచాలు; వాటిని పారదోలటం ఎవరితరమూ కాదు’ అన్నాడు.

‘ఒకవేళ నేను వాటిని పారదోలగలనేమో! పిశాచాలు యీ ముసలి

సిపాయి ఆజ్ఞ శిరసావహిస్తాయేమో ఎవ రెరుగుదురు?'

'చాలమంది ధైర్యవంతులు ప్రయత్నించారు, కాని లాభం లేదు. పోయినేడు నీలాగే ఓ యాత్రికుడు వచ్చి రాత్రంతా ఆ మేడలోనే గడిపాడు. తీరా తెల్లవారేటప్పటికి మేమతని బొమికలు మాత్రమే చూడగలిగాం.'

'పాతికేళ్లు సిపాయి నౌకరీ చేశాను. అన్నిరకాల యుద్ధాలూ దండయాత్రలూ ఎరుగుదును. ఆ కథలన్నీ మీకు చెప్పటానికి యింకా బతికే వున్నాను కద! కనక, యీ పిశాచాల సంగతి నాకు వొదిలెయ్యండి.'

'సరే నీ యిష్టం. భయం లేదనుకుంటే వెళ్లు. వాటిని పారదోలితే నీకు బహుమానం యిస్తాను.

'నాకు కొన్ని కొవొత్తులూ, వేగిన చెక్కలూ, ఉడికిన దుంపముక్కలూ - సాధ్యమయినంత పెద్దవి-యివ్వండి.'

'దుకాణంలోకి వచ్చి, నీయిష్టం వచ్చినవి యేరుకో' అన్నాడు షావుకారు.

సిపాయి యేరి కోరినవి పుచ్చుకుని కొత్త మేడలోకి వెళ్లాడు.

సరిగా అర్ధరాత్రికి, అకస్మాత్తుగా ఒక పెద్దకోలాహాలం రేగింది. తలుపులు గట్టిగా కొట్టుకొంటున్నాయి. నేల వొణుకుతోంది. రణగొణ ధ్వనులతో నృత్యబృందం సాగింది. ఇల్లంతా గందరగోళంగా తయారయింది. సిపాయి మటుకు నిశ్చింతగా వేగిన చెక్కలు నములుతూ, చైపు తాగుతూ కూర్చున్నాడు. ఇంతలో తలుపు తెరుచుకుని ఒక పిశాచం ఆగదిలోకి తొంగిచూచింది. చూచిందే తడవుగా అరిచింది! 'ఇక్కడో మనిషున్నాడు, రండి, విందు చేసుకుందాం'

పిశాచాలన్నీ ఒకటి తరవాత ఒకటి పరుగెత్తుకొచ్చాయి. సిపాయి వున్న గదిగుమ్మందగ్గర నిలుచుని, అతన్ని తేరిపార చూస్తూ 'యితన్ని ముక్కలు ముక్కలు చేదాం. నమిలి మింగేదాం' అనుకుంటున్నాయి.

'అంత తొందర పడకండి మరి, మీలాంటివాళ్ళని బోలెడుమందిని చూచాను. మళ్లీ తలఎత్తుకు తిరక్కుండా తన్ని పంపించాను. మీ పీకలు నులిమేస్తాను' అన్నాడు సిపాయి. పిశాచాల నాయకుడు, యీ మాటలకు, గుంపులోంచి తోసుకు ముందుకు వచ్చాడు.

వచ్చి 'రా! అయితే మనం బలాబలాలు చూచుకుందాం' అన్నాడు.

'సరే, మీలో ఎవరైనా కానీ- రాయిని పట్టుకు పిండి, రసం తెప్పించగలరా?, అన్నాడు సిపాయి. ఓ పిశాచం వీధిలోకి వెళ్లి రాయిని లాక్కొచ్చింది.

'ఊ-కానీ, నీసత్తా చూదాం'

'ముందు మీరే ప్రయత్నించండి. నా వొంతు తరవాత!' అన్నాడు సిపాయి.

పిశాచాల నాయకుడు రాయిని నొక్కి అదిమాడు, చేతిలో చివరకు పిడికెడు యిసుక మాత్రం మిగిలింది. 'చూడు, మరి!' అన్నాడు సగర్వంగా.

సిపాయి తన సంచిలోంచి, తాను తెచ్చిన ఉడికిన దుంపముక్క తీశాడు. 'చూడు, యీ రాయి నువ్వు తెచ్చిన రాయికన్నా పెద్దది' అంటూ దాన్ని అదిమాడు. రసం ప్రవహించింది. 'చూశావా' అన్నాడు.

పిశాచాలు నిర్ఘాంతపోయినాయి.

'యిందాకటినించీ యేమిటి తింటున్నావు?'

'చెక్కలు. మీరు వీటిని నమలలేరు కూడాను!'

అంటూ సిపాయి పిశాచాల నాయకుడికి ఓ తుపాకిగుండు అందించాడు. నాయకుడు దాన్ని నోట్లో వేసుకున్నాడు ఎంత నమిలినా అది చదనవుతోందిగాని కొరుకుడు పడటమే లేదు. ఎదురుగా సిపాయి చెక్కలు నముల్తూ కూర్చున్నాడు. పిశాచాలు వెర్రిముఖాలు వేసుకుని చూడసాగాయి, అతనివైపు.

'మీ దగ్గర చాలా తమాషాలున్నాయని విన్నాను. మీరు చాలా పెద్దవాళ్ళుగాను, చాలా చిన్నవాళ్ళుగానూ అవగలరట కదూ! చీమ దూరేంత సందులోంచయినా మీరు దూరిపోగలరటగా!' అన్నాడు సిపాయి.

'అవును' అన్నాయి పిశాచాలు.

'అయితే, మీరందరూ కలిసి నా సంచిలో దూరిపోగలరేమో ప్రయత్నించండి.

పిశాచాలు సంచి అందుకుని ఒకళ్ళకన్నా ముందు మరొకళ్ళు హడావుడి పడుతూ అందులో దూరాయి. ఒక్క అరనిమిషంలో యిల్లంతా ఖాళీ అయింది. పిశాచాలు సంచిలో దూరిపోయాయి. సిపాయి దాని మూతి బిగించి, గట్టిగా కట్టేసి ఒక మూల పడేశాడు.

# దైవలీల

మండ రామారావు

పూర్వం ఒకపెట్టెలోన
పాము ఒకటి ప్రవేశించె
ఆ గృహస్థు దాని చంప
ఆ రంధ్రము మూసివేసె
సర్పమందు చిక్కిపోయె
సందులేక విచారించె—

వారంరోజులు గడచెను
పాము తినగతిండి లేక
పడిపోయెను తికమకలు
కడపట్టెను ప్రాణములు
ఇక జీవుడు నిలవడని
నిరాశయే పొందెను—

ఆహారం ఎట దొరకక
ఆకలితో పలవరించు
తిండిపోతు ఎలుక ఒకటి
రంధ్రం చేసెను పెట్టెకు
తొందరగా ప్రవేశించె
అందేమున్నదో తెలియక—
తిండికోరకు వాచి వున్న
ఎండిపోయి వున్న పాము
భక్షించెను ఆ ఎలుకను
ప్రాణం కాపాడుకొనెను
జారుకొనెను చల్లగాను
చేరుకొనెను తన గృహమును.
ఆహారార్థము పోయిన
ఎలుకకు ప్రాణం పోయెను
చావసిద్ధమైన పాము
చక్క బ్రతికి బయటపడెను.
తరచి చూడ తెలియగలవు!
పరమేశ్వరు లీల లెన్నో—!

## ★ మృత్యుంజయుడు ★

'ఇక చిన్న నిద్ర తీస్తాను' అనుకుని పోల్జారు హుందాతనం వుట్టిపడుతూండగా నిద్రకు పడ్డాడు.

తెల్లవారగానే షావుకారు తన నౌకర్లను పిలిచి 'వెళ్ళి ఆ ప్రయాణీకు డేమయాడో చూచిరండి. ఒక వేళ చనిపోయినట్లయితే, వాడి బొమికలన్నీ యేరండి.'

వాళ్లు వచ్చి, పైపు నోట్లోపెట్టుకుని గదులన్నీ విశదీకరంగా పరిశీలిస్తున్న సిపాయిని చూచారు.

'సుదినం, సిపాయీ—నిన్ను సజీవంగా చూస్తా మనుకోలేదు. నీ బొమికలు యేరుకువెళ్ళేందు కొక పెట్టె కూడా తెచ్చాం చూడు'— సిపాయి మందహాసం చేశాడు.

'వాటిపని అయిపోయింది, సరే, యీ సంచి కంసాలి దగ్గరికి తీసుకెళ్ళాలి. మీరు సాయంపట్టండి. యిక్కడికి చాలదూరమా?'

'ఎక్కువదూరం లేదు.'

వాళ్లంతా కలిసి పిశాచాలున్న సంచి కంసాలి దుకాణానికి మోసుకెళ్ళారు.

'యిప్పు డీ సంచి నిప్పుసెగని పెట్టి, సుత్తిదెబ్బలు కొట్టండి.'

కంసాలి, అతని దుకాణంలో వాళ్ళూ ఆపని కానిచ్చారు.

లోపల్నుంచి పిశాచాలు ఘోష పెడుతున్నాయి! 'మమ్మల్ని వొదిలెయ్యి సిపాయీ, పోనివ్వు' అని.

కంసాలి తనపని కానిస్తున్నాడు. సిపాయి 'యీ పిశాచాలకి బుద్ధి చెప్పాలి. యింకా గట్టిగా కొట్టండి ఊఁ' అంటున్నాడు.

'ఆ యింట్లో మళ్ళా కాలు పెట్టం. యింక యీవూరి చాయలకే రాం...మమ్మల్ని వొదిలితే, నీకు మంచి బహుమానంకూడా యిస్తాం' అని పిశాచాలు మొత్తుకుంటున్నాయి.

'ఇప్పుడు దారిలోకి వచ్చారు' అని సిపాయి, మూట బయటికి తీయించి, ముడులు విప్పి, ఒకటి తరవాత ఒకటిగా అన్ని పిశాచాలనీ బయటికి రానిచ్చారు కాని, నాయకుడిని మాత్రం వొదల్లేదు.

'మీరంతా వెళ్లి నాకిచ్చే బహుమానం పట్టుకరండి. అప్పుడు గాని మీ నాయకుడిని వదలను.'

సిపాయి పైపు తాగుతూండగా, వెనకాలనుంచి ఓ పిశాచం చేత్తో, పాత జేబుసంచి పట్టుకువచ్చి 'యిదిగో, నీకు బహుమానం—' అంది.

సిపాయి దాన్ని తీసుకుని ఎగాదిగా చూచి, తెరిచి చూచాడు— అంతా ఖాళీ!

'నన్నే తమాషా చేస్తున్నావుగా! ఉండు, మీ నాయకుడికి యింకో మోతాదు యిస్తాం—' అన్నాడు కోపోద్రేకంలో.

యీమాటలకు సంచిలోంచి, నాయకుడు 'నన్ను కొట్టకు సిపాయీ, నేను చెప్పేది కాస్త శాంతంగా విను. నువు చూస్తున్నది వొట్టి పాత సంచి కాదు నాయనా, నీ కోరికల సంచి! యీ ప్రపంచంలో కల్లా అల్లాంటిది యిదొక్కటే. నీ మనసులో యేదేనా కోరుకొని, సంచిలో చూడు. నీవు కావలనుకున్నది కనిపిస్తుంది. ఒకటే ముక్క 'లోప

లికి రా—' అను, నువ్వు కావాలను కున్నది సంచిలో సిద్ధిస్తుంది' అన్నాడు.

'నీమాటలు ఎంతవరకు నిజమో చూస్తాను' అని, సిపాయి మనసులో అనుకున్నాడు – సంచిలో మూడు సారా సీసాలు కావాలి! మనసులో యీముక్క అనుకోవడమే తడవుగా, మూడు సారా సీసాలూ లోపల కనిపించాయి.

సిపాయి సారాను అందరికీ పంచాడు. వరండాలో దూలం మీద నో పావురం కూర్చుంది. అతను కోరికల సంచి తెరిచి 'లోపలికి రా' అన్నాడు పావురం దానంతటదే కదిలి సంచిలో కూర్చుంది.

'నువ్వు చెప్పింది నిజమే. నువ్వు నిజాయితీగానే ప్రవర్తించావు. యిలాంటి సంచి మాబోటి ముసలి సిపాయికి అత్యంత అవసరం' అంటూ అతను సంచి విప్పి, పిశాచాల నాయకుడిని యివతలకు రమ్మన్నాడు. 'యిక నువ్వు వెళ్ళవచ్చు. కాని ఒక మాట గుర్తుంచుకో. తిరిగి నా కంట పడ్డావా, ఆపైన జరిగేదానికి నన్ను అని లాభం లేదు—'

కనురెప్పపాటులో పిశాచాలు ఆగది ఖాళీ చేశాయి. సిపాయి తన కోరికల సంచీ తీసుకుని కంసాలికి వాళ్ళకి గుడ్‌బై కొట్టి పావురాలు దగ్గరికెళ్ళాడు.

'యిక మీరు నిర్భయంగా మీ నూతన గృహంలో ప్రవేశించవచ్చు. మిమ్మల్ని ఎవరూ ఏమీ చెయ్యలేరు' అన్నాడు.

# ★ మృత్యుంజయుడు ★

షావుకారు అతనివంక నిశ్చేష్టుడైచూచాడు. ఎదురుగా మనిషి నించుని వుండగా, నమ్మకుండావుండ గలగటం ఎల్లాగు?

సిపాయి జరిగిందంతా చెప్పాడు. షావుకారు నౌకర్లు దాన్ని ధ్రువ పరిచారు.

'ఒకటి రెండు రోజులు నిదానించి మరీ ప్రవేశించటం మంచిది. ఆ దుష్టశక్తులు తిరిగీ రాకుండా ఉండాలిగద!' అనుకున్నాడు షావుకారు.

ఆ సాయంకాలం తన నౌకర్లని పిలిచి 'యీ రాత్రికి మన కొత్త యింట్లో పడుకోండి. ఏదేనా ప్రమాదం తటస్థించినా, సిపాయి వుంటనే వున్నాడు' అని చెప్పాడు.

ఆ రాత్రి వాళ్ళకు నిరపాయంగా గడిచిపోయింది. మూడోరాత్రి షావుకారు తనకి తానే అక్కడ పడుకుని, యీ విషయం నిర్ధారించుకోవాలనుకున్నాడు. అంతా సక్రమంగా నడిచింది. చాలా ప్రశాంతంగా నిద్ర పట్టింది. ఆ తరవాత ఆ షావుకారు ఆ యింటికి బూజు దులిపించాడు, మళ్ళీ వెల్ల వేయించాడు. పెద్ద పెట్టున విందుచేశాడు. షావుకారు సిపాయిని గౌరవస్థానంలో కూర్చోపెట్టి తన ప్రియతమమైన అతిథిగా సత్కరించాడు.

విందంతా పూర్తయి, అంతా నిద్రలకు పోయేటప్పటికి తెల్లవారు జామయింది.

నిద్ర లేచాక, సిపాయి తను వెళ్లిపోటానికి సర్దుబాటు చేసుకుంటున్నాడు. షావుకారు అతన్ని మరో వారంపాటు తనతో వుండమని బలవంతం చేశాడు. సిపాయి "క్షమించండి, యిప్పటికే చాల రోజులు వుండిపోయాను. యింటికి వెళ్ళిపోవాలి!" అన్నాడు.

షావుకారు, సిపాయి సంచి నిండా వెండి నింపాడు. 'యేదో చేతనైన సహాయం' అన్నాడు.

కాని సిపాయి 'నాకు వెండి అవసరం లేదు. నేనా వొంటరిగాడిని. చెయ్యీ కాలూ యింకా సరిగానే వున్నాయి. నా బ్రతుకేదో నేను వెళ్లదియ్యగలను—' అని సెలవు పుచ్చుకున్నాడు.

అతనల్లా ఎంత దూరం వెళ్లాడో చెప్పడం కష్టం, చిట్టచివరికి తన స్వగ్రామం చేరుకొన్నాడు. కొండ పక్కన ఆ చిన్న గ్రామాన్ని చూస్తేనే అతనిమనసు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయింది. అడుగులు వడివడిగా వేయసాగాడు. 'ఆహా! ఎంత రమణీయంగా వున్నదీ ప్రకృతి! ఎన్నో నగరాలు పట్టణాలూ చూచాను కాని యిలాంటి స్థలం నాకీ విశాలవిశ్వంలో ఎక్కడా కనపడలేదు. ఉన్నవూరు...'

సిపాయి తన గుడిసె చేరుకున్నాడు. మెట్లు ఎక్కి తలుపు తట్టాడు. నడుము వొంగిన ముదిముసలమ్మ తలుపు తెరిచింది. సిపాయి ఆమె పాదాల ముందు వాలాడు. ముసలమ్మ తనకొడుకుని గుర్తు పట్టింది. ఆమె ఆనందానికి హద్దు లేకపోయింది.

'మీ నాన్న నీమాట పలవరిస్తూ పోయాడు. యీరోజు చూచే భాగ్యం ఆయనకు లేదు. అప్పుడే అయిదేళ్లు దొర్లిపోయాయి...' సిపాయి తల్లిని ఓదార్చాడు.

'యింక నీకేం ఫరవాలేదమ్మా! నీక్కావల్సినన్ని సదుపాయాలు చేస్తాను'

తన కోరికల సంచీ తెరిచి భోజన పదార్థాలు కావాలన్నాడు. రకరకాల తినుబడిసరుకులు వచ్చాయి.

'తినమ్మా, తిను-యింకా నీకేం కావాలన్నా తెప్పిస్తాను'—అమర్నాడు అతను మళ్లీ తన కోరికల సంచీనిండా వెండి తెప్పించాడు. తరవాత పనిలోకి వెళ్ళాడు.

ఇల్లు కొన్నాడు, ఆవునీ గుర్రాన్ని...యింకా యింటికి కావల్సినవన్నీ కొన్నాడు. ఒక యువతిని ప్రేమించి వివాహం చేసుకున్నాడు. సుఖంగా కాలం వెళ్లబుచ్చుతున్నాడు. అతని తల్లి, మనమళ్లనీ మనమరాళ్లనీ ఆడిస్తూ అంతులేని ఆనందాన్ని పొందుతోంది. ఈ రకంగా యేడెనిమిది— సంవత్సరాలు దొర్లిపోయాయి. ఒకరోజు సిపాయి జబ్బుపడ్డాడు. మూడురోజులపాటు తిండీ దాహం లేకుండా పక్కలో పడున్నాడు! పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారయింది. మూడోనాడు అతనికి మృత్యువు దగ్గరగా వొచ్చి, కత్తి ఝుళిపిస్తూ తనవంక కోరచూపులు చూడటం కానవచ్చింది. మృత్యువు అన్నది: 'రా, నాయనా, సిపాయి. నిన్ను తీసుకెడదామనే వచ్చాను.'

'ఏమంత తొందరవచ్చిపడింది? యింకో ముప్ఫయి సంవత్సరాలపాటు నన్ను బ్రతకనీ-నా కొడుకులకూ కూతుళ్ళకూ పెళ్ళిళ్ళు చేసి, మనమళ్ల ముచ్చటకూడా చూడాలనుంది. ఆపైనవచ్చి తీసుకెళుదువు

గాన్లే, యిప్పుడప్పుడే నాకు చావా లని లేదు.'

'లాభం లేదు సిపాయి, మూడు గంటల విరామం అయినా యిచ్చేందుకు లేదు.'

'సరే, ముప్పై యేళ్లు వీల్లేదనుకుంటే, పోనీ మరో మూడు సంవత్సరాలు మాత్రం గడువివ్వు. నేను చెయ్యాల్సిన పనులింకా బోలెడు మిగిలిపోయాయి.'

'మూడు నిమిషాలు టైముకూడా యివ్వను' అని జవాబిచ్చింది మృత్యువు.

సిపాయి యింకేమీ వాదన పెంచలేదు. తన కోరికలసంచీ బయటికి తీసి 'లోపలికి పో' అన్నాడు. ఈ మాటలు అతని నోటివెంట వచ్చాయోలేదో అతనికి కాస్త హుషారు కలిగినట్లయింది. ఎదురుగా నించునున్న మృత్యువు అక్కడ లేదు. సిపాయి కోరికలసంచివంక చూచాడు దాన్లో మృత్యువు కాక మరెవరు కూర్చునుంటారు?

సిపాయి సంచిమూత గట్టిగా బిగించాడు పక్కమీంచిలేచి రొట్టెముక్క తిన్నాడు గ్లాసెడు సారాయం పట్టించాడు. యథాపూర్వంగా తయారయాడు. 'అయితే నువు నేను చెప్పినట్టు వినవుగదూ! దాని ఫలితం నీకు యిక తెలిసి వస్తుందిలే!'

'నన్నేం చేయదల్చుకున్నావు?' మృత్యువు సంచిలోంచి అడిగింది.

'సంచి పోతున్నందుకు నాకు విచారంగానే వుంది. కాని యేం చెయ్యను? తప్పనిదై వచ్చింది. నిన్ను సంచిసహితంగా తీసుకెళ్లి మురికికాలవలో ముంచుతాను. నీ జీవితకాలంలో యీ సంచిలోంచి తప్పించుకోలేవు'

'నన్ను బయటికిపోనీ సిపాయీ, నువు అడిగినట్లు నీకు మూడేళ్ల ఆయుషు యిస్తాను-'

'ఆ భయమేమీ లేదు, నువు బయటికి రావులే!'

'మళ్ళీ ప్రార్థిస్తున్నా, నన్ను బయటికి రానిస్తే, నీకు ముప్పై యేళ్ళ ఆయుర్దాయం యిస్తాను.'

'సరే-ఒకషరతుమీద యితే నిన్ను యివతలకు రానిస్తాను. ఈ ముప్పై యేళ్లలో నువు ఎవరి ప్రాణమూ తియ్యటానికి వీల్లేదు-'

'ఆ కావాగ్దానం యివ్వలేను, ఎవరి ప్రాణమూ తియ్యకండా నేనెట్లా జీవించేది!' అన్నదిమృత్యువు.

'కందమూలాలు తిని బతుకు యీ ముప్పైయేళ్లూ!'—మృత్యువేమీ బదులు పలకలేదు. కనక, సిపాయి దుస్తులు వేసుకుని బయలుదేరబోయాడు.

'సరే నువు నా మాట విన్లేదు కనక, నిన్ను బురదగుంటలో ముంచటం కన్న నాకు గత్యంతరం లేదు.' ఈ మాటతో మృత్యువు నోరు తెరిచి 'సరే నీ యిష్టప్రకారమే కానీ- యీ ముప్పైయేళ్లలో నేను ఎవరి ప్రాణమూ తియ్యను. కందమూలాలమీదే ఆధారపడి వుంటాను. నన్నిక వొదిలెయ్యి-' అంది.

సిపాయి 'జాగ్రత్త, మోసం గీసం నాదగ్గర పనికిరాదు' అన్నాడు. ఊరి బయటికి తీసుకెళ్లి మృత్యువుని వదిలాడు 'పో, యిక, లేకపోతే-నా మనసు మారిపోతుంది మళ్లీ—'

మృత్యువు వేసుగా పారిపోయింది, అంతకంటే యేం చెయ్యగలదు కనక?

—జనం అంత సుఖంగా మరె

★ [illegible] ★

[illegible] లేదు. ఎవరికీ జబ్బన్న మాట లేదు, చావు-న రేసరి-జనం దాసి పేరే మర్చిపోసాగారు.

ఈవిధంగా మూఫ్ఫై సంవత్సరాలు దొర్లాయి.

ఈలోపల సిపాయి సంతానం పెద్దవాళ్ళయ్యారు. పెళ్లిళ్లు చేసుకున్నారు. కుటుంబం పెద్దదయింది. అందరినీ జీవితంలో ఒక స్థాయికి తేవలసివచ్చింది. సిపాయికి క్షణం తీరిక లేదు. రోజంతా సుఖంగా గడిచిపోతోంది అతనుపట్టిందంతా బంగారం మవుతోంది. జీవితం చక్రంలా దొర్లిపోతోంది. అతనికి మృత్యువువిషయమే స్ఫురణకు రావడం లేదు.

కాని ఒకరోజు మృత్యువుసాక్షా త్కరించింది.

'ఈ రోజుతో మూఫ్ఫై సంవత్సరాలు పూర్తయ్యాయి. నీకాలం తీరింది రా, సిపాయీ, నేను నీ కోసమే వచ్చాను—' అంది.

సిపాయి వాదనలోకి దిగలేదు.

'నేను సిపాయిని. మొదటి పిలుపుకే సిద్ధంగా వుంటాను. నా కాలం తీరిపోయినట్లయితే, ఏదీ శవ పేటిక?—తీసుకురా."

మృత్యువు శవపేటిక తెచ్చి, మూత తెరిచింది. "లోపలికి పో, సిపాయీ—"

సిపాయి క్రొధుడయాడు. "ఏ పనయినా చెయ్యటం మెలానో ఎరుగుదువా? నువ్వు చెప్పగానే సిపాయి వాడు అందుకు పోలేడు. మాకు సైన్యంలో కొత్తపనంతా సార్జెంటు నేర్పుతాడు. అతను ముందు నేర్పుతాడు, చేసిపెడతాడు. తరవాత మేం ఆ ప్రకారం చేస్తాం. నువ్వూ అలాగే చూపాలి.

దాన్లో పడుకోటం ఎల్లాగో ముందు నువ్వు నేర్పు—"

—మృత్యువు శవపేటికలో పడుకుంది. "ఇదిగో, యీ ప్రకారం పడుకోవాలి, సిపాయీ. కాళ్ళు జాపుకోవాలి. రొమ్ముమీద చేతులుంచుకోవాలి.

—సిపాయి యీ ముహూర్తం కోసరమే ఎదురుచూస్తున్నాడు. హటాత్తుగా శవపేటికమూత వేసి గొళ్లెం బిగించాడు.

"నువ్వేపడుకో అల్లా-నాకిక్కడ హాయిగానే ఉంది" అంటూ శవపేటికను బండిలో వేసుకు వెళ్లి నదిలో పారేసి వచ్చాడు.

ఆ శవపేటిక నదీప్రవాహానికి కొట్టుకువెళ్లి సముద్రంలో కలిసింది. సంవత్సరాల తరబడి మృత్యువు సముద్రంలో తేలియాడుతోంది

తిరిగీ ప్రజలు కులాసాగావున్నారు. సిపాయిని పొగడుతున్నారు. సిపాయికూడ ముసలివాడు కాలేదు అతని మనమలూ, మనమరాళ్లూ పెళ్ళిళ్లు చేసుకున్నారు. అతను తన మునిమనమళ్ళనుకూడా జీవితంలో తర్ఫీదు చేస్తున్నాడు. ఇటు యింటి పనులతో అటు బయటిపనులతో అతనికి క్షణం తీరిక వుండటం లేదు. అయినా అతనెప్పుడూ అలిసిపోయినట్లు కనిపించేడు.

ఒకసారి సముద్రంలో తుఫాను తటస్థించింది. సముద్రతరంగాలకు శవపేటిక కొండ కొనలకు డీకొన్నది వాటి ధాటికి మృత్యువు పెట్టె పగిలి బయటపడ్డది. అతికష్టంమీద తీరానికి చేరుకుని, ప్రాణం పోసుకుంది. నడిచేవోపిక రాగానే సిపాయి వున్న గ్రామానికి బయలుదేరింది. అతని పెరట్లో ధాన్యాగారంవుండి అతని ప్రాణాలను కబళిద్దామని దాని వూహ!

సిపాయి పొలానికి బయలుదేరుతున్నాడు గోనెసంచి బుజాన వేసుకున్నాడు. అతను బయటికి రాగానే మృత్యువు బయటపడి 'యీసారి నువ్వు నన్ను తప్పించుకోలేవు'అంది. సిపాయి ఒక నిమిషంపాటు భయపడ్డాడు. కాని వెంటనే కూడగొట్టుకుని - పోని ప్రయోజనంమాట అటుంచి, బెదిరించి చూదాం - అనుకున్నాడు. 'యీసారి నీకు సంచిలో దూరదామనుందన్న మాట! మురికిగుంటలు వాసన చూడాలనుంది కదూ?' అన్నాడు.

మృత్యువు సిపాయి బుజంమీదున్న ఖాళీసంచీమాచి నిలువెల్లా వణికింది యిదే కోరికలసంచి అని భ్రమిసి ఒకటే పరుగు లంకించుకుంది.

సిపాయి కంటపడకుండా పరిగెత్తటమే దాని లక్ష్యం! ఏమంటే, యీసారి అతని కంటపడితే, మురికిగుంటల్లో మునగక తప్పదు.

ఇక అప్పటినించీ, మృత్యువు ప్రజల ప్రాణాలను రహస్యంగానే వుండి తీసుకుపోతోంది.

సిపాయి మటుకు నిర్విచారంగా కాలం వెళ్లబుచ్చుతున్నాడు. జనాభిప్రాయంప్రకారం అతనింకా జీవించే వున్నాడు, యిప్పటికీ సుఖంగానే వున్నాడు. ★

('రష్యన్ జానపద సాహిత్యం'—నుంచి)

బాలసాహితి సీరియల్

# సాగర గర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

## జరిగిన కథ :—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచ ప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణం చేసే నౌకలకది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. దానివలన నాగరిక ప్రపంచానికి, ముఖ్యంగా నౌకాప్రయాణాలకి ప్రమాదం సంభవించవచ్చునని అందరూ అభిప్రాయపడ్డారు. దానికి అంతు కనుక్కొని హతిమార్చాలని ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కౌన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ మహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతరంగాలమీద ఒక పెద్ద వెలుగు కనిపించింది. ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్ళ వర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా మరికొందరితో సహా సముద్రంలో పడిపోతాడు. సముద్రంలో పడికొట్టుకుపోతూ కొంతసేపటికి ప్రొఫెసర్ అరోనా, కౌన్సిల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు. భోంచేసి అందరూ హాయిగా నిద్రపోతారు. తిరిగి తమ కన్నపావాలు రాలేదని అంతా మథన పడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుం

అనువాదం: "వినాయక"

"అయితే మేము బ్రదికిఉన్నంత కాలము, మరి మా స్నేహితుల్నీ బంధువుల్నీ కళ్లారా చూసే ఆశ విడిచిపెట్టి వెయ్యాలన్న మాట!"

"నిజమే! విడిచిపెట్టాలి! ప్రపంచంలో మీ రనుభవించేదంతా స్వాతంత్ర్యమేనని ఊరేగుతున్నారు మరి! ఇక్కడ ఉండడం అంతకంటె యమలోకంలా ఉండదు లెండి!"

ఈ మాటలు విని నెడ్‌లాండ్ అట్టుడుకినట్టుడికి పోతూ ఇలా గన్నాడు:

"ఏమైనా సరే! నేనిక్కడినించి తప్పించుకుపోనని మాట ఇవ్వను!"

జలాంతర్గామి సర్వాధికారి దానికి కొంచెం బింకంగా సమాధానం ఇచ్చాడు:

"నేను మిమ్మల్ని మాటఇవ్వమని అడగడం లేదు! తెలిసిందా!"

# ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

నా కేక ఉండబట్టలేదు. కొంచెం బింకంగా అన్నాను:

"అయ్యా మేమీవిధంగా నిస్సహాయస్థితిలో ఉన్నామని మీరు మీ అధికారం అంతా మామీద చలాయిస్తున్నారు! ఇది చాలా అన్యాయం!"

దానిమీద ఓడ కెప్టెన్ సాధికారంగా ఇలాగన్నాడు:

"అయ్యా! దీనిలో మీ రన్న అన్యాయమేమి లేదు. ఇది చాలా జాలిగుండెతో అన్నమాట! మీరంతా నాయుద్ధఖైదీలు! మిమ్మల్ని అందరినీ అమాంతంగా ఈ సముద్రంలో ముంచినా తేల్చినా నన్నడిగేవాడెవడూ లేదు. ముందుగా మీరంతా నా మీదికి దండెత్తి వచ్చారు. నే నెంతో గోప్యంగా దాచుకుంటున్న రహస్యం నాస్తా బట్టబయలు చెయ్యాలనే దురుద్దేశ్యంతో ఇక్కడికి వచ్చినట్టు కనిపిస్తున్నారు. నా బ్రదుకంతా ఈ రహస్యం మీదే ఆధారపడి ఉంది. ఇలాంటి పరిస్థితులలో తిరిగీ మిమ్మల్ని అందరినీ మళ్ళీ మానవ ప్రపంచంలోకి పంపిస్తాననే అనుకుంటున్నారా? అది ఎన్నటికీ జరగదు! మిమ్నల్ని అందరినీ ఇక్కడ అట్టేపెట్టడం మీ కోసమే అనుకుంటున్నారేమో! అది పొరబాటు. ఇది నా రహస్య రక్షణకోసమే! తెలిసిందా?"

ఆ మాటలు వినేసరికి కెప్టెన్ ఈవిషంలో ఒక నిశ్చయానికి వచ్చివేశాడనీ ఇక అతనితో వాదించడం వల్ల పిసరంతైనా లాభం లేదనీ తెలిపోయింది. ఇది కనిపెట్టి నేను నెమ్మదిగా ఇలాగన్నాను:

"అయితే ఇక మమ్మల్ని అందరినీ చావో బ్రదుకో తేల్చుకోమని అంటున్నా రన్నమాట!"

"అవును! అంతే!"

తరవాత నేను మావాళ్ళతో - "ఇక ఈవిషయంలో మనం మాట్లాడవలసిందేమీ కనిపించదు. అయితే ఈ అధికారికి మనం ప్రత్యేకంగా మాట ఇవ్వవలసిన అవసర మేమీ లేదు."

"నిజమే" అని కెప్టెన్ కొంచెం నెమ్మదిగా మొదలు పెట్టాడు:

"ఇదిగో! నేను చెప్పవలసినదంతా పూర్తిచెయ్యనీయండి! ప్రొఫెసర్! వీరు మీ స్నేహితులు, నాతోబాటు కలిసి మెలిసి ఉంటే అంతగా బాధపడవలసిందేమీ ఉండదు. ప్రొఫెసర్! మీరు శాస్త్రవిజ్ఞానంలో చాలా పెద్ద పెద్ద పరిశోధనలు చేశారు. అయితే నా ఓడమీద ఉంటే మీ రిదివర కెన్నడు కని విని ఎరగని అత్యద్భుత విషయాలు గ్రహించగలరు. జాగ్రత్తగా ఆలోచించుకోండి!"

ఈ మాటలు వినేసరికి నాలో కొంచెం పెద్దమార్పే వచ్చింది. నాకతని మాటలు వింటూంటే కొంత ఓదార్పు కలిగింది. అందుచేత కొంత సంతృప్తి పొంది—

"కెప్టెన్ మీ పేరేమిటి?" అన్నాను.

"నా పేరు కెప్టెన్ నీమో! నాకు, మీకు మధ్యనున్న సంబంధం ఇంతే. ఇక మీరంతా ఈ నాటిలస్ జలాంతర్గామిలో ప్రయాణీకులు అంతే! తెలిసిందా!"

తరవాత కెప్టెన్ తన నౌఖరును పిలిచాడు. అతగాడక్కడికివచ్చాడు. మాకు తెలియని భాషలో అతనికేమేమో ఫర్మానాలు జారీచేశాడు. తరవాత కౌన్సెల్ నెడ్‌లాండ్‌లకేసి తిరిగి - "మీ ఫలహారాల ఏర్పాటులన్నీ మీ గదిలోనే జరిగాయి. దయచేసి వాడి వెంట వెళ్ళండి." అన్నాడు.

పాపం ఇన్నాళ్ళనించీ నానా యాతనలు అనుభవిస్తున్న నా సహచరు లిద్దరు ఎంతో ఉత్సాహంగా ఆ నౌఖరు వెనకాలే వెళ్ళిపోయారు. తరవాత కెప్టెన్ నాకేసి తిరిగి—"ప్రొఫెసర్! మన ఫలహారా లప్పుడే వడ్డించేశారు. మనం అక్కడికి వెడదామా?" అన్నాడు.

నేను కెప్టెన్ నీమో వెనకాలే నడిచివెళ్లాను. అలాగ కొంతదూరం నడిచి మేమొక భోజనం హాలులో ప్రవేశించాము. అది చాలా చక్కగా అమర్చి అలంకరించిన గది. గదినిండా చాలా విలవైన పింగాణీ పాత్రలు, బల్లలు, కుర్చీలు ఉన్నాయి. అవ్వన్నీ గది తనాబీపై అమర్చిన విద్యుద్దీప కాంతిలో తళ తళా మెరిసిపోతున్నాయి. కెప్టెన్ నీమో నాకొక కుర్చీ చూపించి—

ప్రొఫెసర్! మీ రా కుర్చీలో కూర్చోండి! పాపం మీకు చాలా ఆకలవుతోందేమో!" అన్నాడు.

అక్కడి భోజనపదార్థాలన్నీ చాలావరకు సాగరగర్భంలో దొరికే మత్స్యాలమాంసంతో తయారుచేసినవే! అవి చూడడానికీ తినడానికీ చాలా బాగున్నాయి.

కెప్టెన్ నాకేసి చూశాడు. కేనేమీ మాటలాడలేదుగాని అతడే నా అభిప్రాయం కనిపెట్టి నెమ్మదిగా ఇలాగన్నాడు:

"ఇవి ఇంతకు పూర్వం మీ రెన్నడు రుచి చూడని వంటకాలు. అయితే మీ రివ్వన్నీ నిరభ్యంతరంగా తినవచ్చును. చాలా బాగుంటాయి. వాటివల్ల శరీరానికి మంచి పుష్టి కలుగుతుంది. నేను భూమి మీద దొరికే ఆహారం విడిచిపెట్టి చాలా రోజులయింది. మా జలాంతర్గామి సరంగులంతా ఈ ఆహారమే తీసుకొంటున్నారు. అందరు బాగా పుష్టిగా, ఆరోగ్యంగా ఉన్నారు."

"అయితే ఇవ్వన్నీ జలజంతువుల మాంసంతో తయారుచేసిన పదార్థాలే నన్నమాట!" అన్నాను.

"అవును ప్రొఫెసర్! సముద్రం నాకు కావలసిన ఆహార పదార్థాలన్నీ సప్లయి చేస్తూంటుంది. ఒక్కొక్కప్పుడు నేను వలలు పన్ని వాటిద్వారా నా ఆహారపదార్థాలన్నీ సంపాదిస్తూంటాను. ఒక్కొక్కప్పుడు స్వయంగా సముద్ర గర్భంలో ఉండే అడవుల్లో వేటాడుతూంటాను. మనుష్యమాత్రులెవరు ఆ అడవుల్లో అడుగుపెట్టి ఉండలేదు. ఇంకా సముద్రగర్భంలో ఉండే పచ్చికబీళ్లలో నే నెన్నో చిత్రవిచిత్రమైన సస్యాలు సాగు చేయిస్తూంటాను. ఒక్కొక్కప్పుడు సృష్టికర్తే స్వయంగా అవ్వన్నీ నా కోసం సృష్టించాడా అనిపిస్తూంటుంది."

ఆ మాటలు విని నే నెంతో ఆశ్చర్యపడ్డాను.

"మీరు సముద్రంలో మత్స్యాల మాంసం సంపాదిస్తున్నా రంటే నాకేమీ ఆశ్చర్యం కలగడం లేదు. అయితే మీరు జంతువుల మాంసం ఎలాగ సంపాదిస్తున్నారో మాత్రం తెలియడం లేదు."

దానిమీద కెప్టెన్ ఇలాగన్నాడు:

"మీరు మాంసం అనుకొనేది ఒక విధమైన సముద్రపు తాంబేలు మాంసమే గాని మరేమీ కాదు. నా వంటమనిషి చాలా తెలివైనవాడు. ఇంకా ఇతర జల జంతువులతో ఇలాంటి మాంసపు కూరలే తయారుచేస్తాడు. ఈ వంటకాలన్నీ మీరు తప్పకుండా రుచిచూడాలి. ఇలాంటివి మీ రెక్కడా రుచి చూచి ఉండరు. ఇవి చాలా చిత్రవిచిత్రమైన వంటకాలు."

నే నవ్వన్నీ కొంచెం కొంచెంగా రుచిచూడడం మొదలుపెట్టాను.

కెప్టెన్ తిరిగీ మొదలుపెట్టాడు:

"సముద్రం మూలంగా నాకొక ఆహారపదార్థాలే కాక వస్త్రాలు కూడా సప్లయి అవుతూంటాయి. మీ రంతా కట్టుకునే బట్టలు సముద్రంలోని ఒక రకపు నారతో తయారుచేసినవే. వాటి రంగులు మొదలైనవన్నీ సాగర రసాయన పదార్థాలవల్లే తయారవుతాయి. ఈ గదిలో అత్తరువులు మొదలైనవన్నీ సముద్రంలోని ఓషధులలోనించి తయారుచేసినవే. ఇవిగాక ఇంకా అనేకమైన వస్తువులు సముద్రంలోనించి తయారు చేస్తూంటాము. మాకు కావలిసినవన్నీ సముద్రంలోనించి వస్తాయి. చివరి కివ్వన్నీ ఎప్పుడో అప్పుడు తిరిగీ సముద్రంలోకే వెళ్ళిపోతాయి."

"మీకు సముద్రం అంటే చాలా ఇష్టమనుకుంటాను."

"అవును! నా పంచప్రాణాలు అదే! సముద్రపు గాలి పీలుస్తూంటేనే నాలో అనుక్షణము ఒక నూతన చైతన్యం ప్రవహిస్తూన్నట్లుంటుంది. ఇక్కడ నిరంకుశ పరిపాలకు లెవరూ ఉండరు. సముద్రం పైభాగంమీదనే మానవాధికారాలు, అహంకారాలు ప్రతిధ్వనిస్తుంటాయి గాని సముద్రం లోలోపలికి వెడితే అవ్వన్నీ అదృశ్యమైపోతాయి. మానవుల ప్రాభవాధికారాలు, దారుణాహంకారాలు, అన్నీ సముద్రం పైపైనే! అయ్యా! నివసిస్తే సాగరగర్భంలోనే నివసించాలి! నే నక్కడ సర్వస్వతంత్రుణ్ణి! అక్కడ నామీద అధికారం చలాయించగలవా రెవ్వరు లేరు!"

అని చెప్పి కెప్టెన్ నీమో తన ప్రసంగం హఠాత్తుగా ముగించివేశాడు. అతని ప్రసంగం అంతా కేవలం తలవని తలంపుగానే జరిగిపోయిందా? అనుకోకుండా చెప్పవలిసినదానికంటె ఎక్కువే చెప్పాననిగాని పశ్చాత్తాపపడుతున్నాడా? తరవాత కొంతసేపటివరకు అతడటూ ఇటూ పచారు సాగిస్తూ ఏమేమో ఆలోచించాడు. దానితో అతని ఆందోళన కొంతవరకు తగ్గిపోయింది. ముఖంలో తిరిగీ ఆ పూర్వ గాంభీర్యం ప్రత్యక్షమైంది. వెంటనే నాకేసి తిరిగి—

"ప్రొఫెసర్! మీకు మా జలాంతర్గామి చూడాలని ఉన్నదా? అయితే వెంటనే చూడవచ్చును. నాతో రండి!" అన్నాడు.

—ఇంకా ఉంది.

# పిల్లల స్వంత ఖర్చు

అప్పట్లో నేను స్కూలుఫైనల్ చదువుతుండేదాన్ని. మా తమ్ముడు ఫోర్తుఫారం చదువుతుండేవాడు. మాకు స్నేహితులు ఎక్కువ, పరిచయాలు ఎక్కువ. నిముషానికోమాటు ఏదో ఒక ఖర్చు వస్తుండేది.

"అమ్మా, మా స్నేహితురాలి పెళ్లి. అంతా కలిసి ఒక బహుమతీ ఇస్తున్నాము. అర్థ రూపాయి కావాలే" అని అడిగాను ఒకనాడు ప్రొద్దున్నే మా అమ్మని. "అల్లాగే" అంది మా అమ్మ.

"మా మాస్టరుగారు ప్రార్కించి వెళ్లిపోతున్నారు. టీపార్టీ చెయ్యాలి. నాకో అర్థరూపాయి కావాలే అమ్మా" అన్నాడు వెంటనే మా తమ్ముడు.

ప్రొద్దున్నే లేస్తూనే రూపాయి ఐపోయింది. మధ్యాహ్నం స్కూల్లో మా విందు ప్రసక్తి వచ్చింది. భారం చాలావరకు నామీదే పడింది. టీపార్టీ ఘనంగా చేయాలనీ, ఫొటో పెద్దది తీయించుకోవాలనీ అనుకున్నాం. అంతా కలిపి మనిషికి 3 రూపాయలవుతుందని అంచనా వేశాం. సాయంకాలం ఇంటికి వస్తూనే ఈ విషయం నాన్నగారికి చిన్నచిన్నలుగా చెప్పి, మూడు రూపాయలు తీసుకున్నాను. మా వాడు మాత్రం ఏం తక్కువ తిన్నాడు? వాడికీ, స్నేహితులతో సినిమాకి పోవడానికి రూపాయి కావలసి వచ్చింది.

ఈరకంగా ఒక్క రోజులో ఐదు రూపాయలు ఎగరగొట్టేశాం సుపుత్రీ పుత్రకులం కలిసి. ఎంత గారాబమైతే మట్టుకు అమ్మ, నాన్నలకైనా అనిపించదూ ఖర్చు ఎక్కువైపోతోందని?.

మర్నాడు ప్రొద్దున్నే కాఫీల దగ్గరే వచ్చింది ఈ ప్రస్తావన.

"అమ్మాయి, నీ ఖర్చేమిటే ఇల్లా పెరిగిపోతోంది?" అన్నారు

**జానకీరాణి**

నాన్నగారు. మా తమ్ముడికి సంతోషం నా ప్రసక్తి ఏమన్నా వస్తే. వెంటనే అందుకున్నాడు.

"ఔను నాన్నగారూ, మరీ దుబారా మనిషి అక్కయ్య. టీపార్టీలు, ఫోటోలు పడదికి ఒకటీ రెండూ కాదు. అర డజను! పైగా నాన్నగారూ, తగుదునమ్మా అంటూ అన్నీ నెత్తినేసుకుని వల్లమాలిన ఖర్చులు చేసి, నష్టమొస్తే చేతి నుంచి పెట్టుకుంటుంది. మరి!

"నేను నల్లే, కోపంగా చాలించవోయి, ఆడపిల్ల అన్నతర్వాత ఆమాత్రం ఖర్చులుండవు కాబోలు. తమరిసంగతి నాన్నగారికి తెలియదనా? నాన్నగారూ, నా ఖర్చులన్నీ కలిపి వీడి సినిమాఖర్చంత వుండదండీ. వారానికి రెండేసి సినిమాలు చూడందే నిలవలేడు. నన్నంటాడు గానీ, వాడి జేబురుమాళ్లు, సైలరు ఖర్చంతో అడగండి. అవన్నీ కలిపితే నా ఖర్చుకి రెట్టింపౌతుంది. నిజమో కాదో అమ్మనడగండి" అన్నాను నేను.

మా అమ్మ అంతా నవ్వుతూ వింటోంది. "ఊరుకోండర్రా, ఇద్దరూ ఇద్దరే. వీళ్ళకి దర్జాలు ఎక్కువ. జమీందారీలక్షణాలు గానీ, మామూలు లక్షణాలు కావు వీళ్ళవి" అన్నది అమ్మ కాఫీ కలుపుతూ. నాన్నగారు చాలా దీర్ఘమైన ఆలోచనలు చేశారు. అమ్మ ఇచ్చిన కాఫీగ్లాసు అల్లా ప్రక్కన పెట్టి కాస్సేపు నిశ్చలంగా చూశారు. అమ్మవంక తిరిగి,

"ఇల్లా ఐతే చాలా కష్టం. వీళ్ళ జీతాలు, పుస్తకాలని మించి ఐపోతోంది ఈ ఖర్చు. తగ్గించే ఉపాయం చూడాలి" అన్నారు.

"ఏం తగ్గిస్తారు లెద్దురూ. ఉన్నవాళ్ళిద్దరూ. నలుగురేసి, ఆరుగురేసి పిల్లలున్నవాళ్లకి ఎల్లానూ తప్పదు తగ్గించుకోవడం. ఏదో జరగనివ్వండి. దానిసంగతంటారా, ఆడపిల్ల. కాస్తో కూస్తో ఖర్చుండకపోదు. వాడేమో మగబిడ్డ! నలుగురిలో చిన్నతనం వాడికే, కానీకి అర్ధణాకి మనం వెనుదీస్తే" అన్నది అమ్మ.

కానీ నాన్నగారు ఆమోదించలేదు. కాస్సేపాగి, "ఏమర్రా పిల్లలూ, ఒకపని చేద్దాం. పోనీ"

అన్నారు. మేమిద్దరం బిక్కమొహం వేసుకుని ఏమిటన్నట్లు చూశాం. మమ్మల్ని గురించి మా ఖర్చుని గురించి ఇంత మీమాంస వచ్చినందుకే చస్తున్నాము మేమిద్దరం.

“మీకు నెలకి చెరో పది రూపాయలు ఇస్తాను. మీ ఖర్చులన్నీ పెట్టుకోండి. మిగిలితే మా కివ్వక్కర్లేదు. దాచుకోండి, ఆ పదిరూపాయల్లో సరిపెట్టుకోవాలన్న మాట. అమ్మని, నన్ను చీటికి మాటికి రూపాయలకోసం అడగక్కర్లేదు మీరు. ఏమంటారు?” అన్నారు.

మాకిది కొత్తగా ఉంది. నిజమే, ఇదే హాయి అనిపించింది నాకు. అదో దర్జా చేతిలో డబ్బుంటే. అన్నిటికీ అమ్మకి అర్జీ పెట్టుకోనక్కర్లేదు. ఎల్లాగూ నేను పొదుపుగా వుంటాను కాబట్టి, కాస్తో కూస్తో మిగిల్చి ఏదైనా కొనుక్కోవచ్చు అనుకున్నాను. మా తమ్ముడు కూడా ఏవో అంచనాలు ఆక్షణంలోనే వేసేసుకున్నాడు కాబోలు. ఇద్దరం ఒకసారే తలూపాం. ఇద్దరికీ చెరో పదీ చేతుల్లో పడ్డాయి.

ఆవేళ ఏదో చందా కట్టాల్సి వచ్చింది. దర్జాగా కట్టేశాను అమ్మతో చెప్పకుండానే. పూలు కొనుక్కున్నాను. దోవనే పోతూ గాజులు కొన్నాను. ఒక వారం గడిచింది.

నాకో క్రొత్త సంగతి తెలియవచ్చింది. ఏమిటంటే ఇదివరకంత విచ్చలవిడిగా ఖర్చుపెట్టటం లేదు నేను. కానీ కానీకి ఆలోచన చేయటం మొదలుపెట్టాను. తమ్ముడికంటే ముందు ఖర్చు ఐపోతుందని ఒక బెంగ, నెలాఖరుకి చేతిలో డబ్బుండదేమో అని మరో బెంగ. దీనితో పెట్టెలో రూపాయిలు కదలడం మానేశాయి. ఇదివరకు పూలు చాలా కొనేదాన్ని. ఇప్పుడు తగ్గించేశాను. ఇదివరకు చీటికి మాటికి బండి ఎక్కేదాన్ని. “కాస్త దూరమేగా!” అని నడవడం మొదలెట్టాను. మా వాడిసంగతి కూడా నాకు కాస్త తెలియడం మొదలెట్టింది. వాడి సినిమా ప్రోగ్రాంలు తగ్గినట్లు కనబడ్డాయి.

“అమ్మాయి, నీ దగ్గరో బేడ వుంటే ఇవ్వవే, నాదగ్గర 5 రూపాయల నోటుంది” అన్నది ఒకనాడు మా అమ్మ. “ఎందుకు?” అన్నాను లేవడానికి బద్ధకిస్తూ. “తోటకూర దాని కివ్వాలి......మళ్ళీ ఇస్తాలేవే, బెంగెట్టుకోకు” అన్నది మాఅమ్మ. సరే, ఇచ్చాను.

మధ్యాహ్నం గాజులొచ్చాయి. నాకు ఆ సాయంకాలానికి చీరకి సరిపోయేలాగా ముదురాకుపచ్చ గాజులు కావాలని జ్ఞాపక మొచ్చి, కేకేశాను. ఒక అర్థ రూపాయికి నేను కొన్నాను. ఈలోగా మా అమ్మ వాకిట్లోకి వచ్చింది. “ఆ ఎర్రగాజులు చూపించు అబ్బాయి” అని పురమాయించింది. అవో అర్థ రూపాయి అయ్యాయి.

“ఇది కూడా ఇచ్చేయవే. తర్వాత ఇస్తాను అలమారు తెరచి సప్పుకు” అన్నది మా అమ్మ. నాకు కాస్త కష్టంగానే అనిపించింది ఇది. ఐనా ఇచ్చేశాను. మరో నాలుగురోజుల్లో ఈవిధమైనకష్టాలు ఎక్కువరావడం మొదలెట్టాయి.

మా వాడు సాయంకాలం బజారు వెడుతున్నాడు. అమ్మ వంటింట్లోంచి కేకేసింది.

“ఒరేయి, పావుపాను కాఫీపొడి కావాలిరోయి” అని. వాడు చెప్పులు విడిచి వంటింట్లోకి వచ్చాడు.

“డబ్బియ్యి” అన్నాడు. మా అమ్మ బియ్యం బాగుచేసుకుంటోంది. “నేనిప్పుడు లేవలేను గానీ, తెచ్చిపెట్టు బాబూ, నీదగ్గరున్నదానితో” అన్నది. మావాడు నా వంక బిక్కమొఖమేసిచూసి, సరేనని మూలిగి వెళ్లాడు. ఇదీ వరస రోజూ.

నాన్నగారు రిక్షావాడికో పావలా ఇవ్వాల్సి వచ్చింది. జేబులు, అలమారలు, బొట్టుపెట్టెలు అన్నీ వెతికినా అణా ముక్కానీ మించి చిల్లర దొరకలేదు. 5 రూపాయలు మార్చాలి. ఎవడిస్తాడు మిట్ట మధ్యాహ్నంవేళ చిల్లర?

“అమ్మాయి, పావలా!” ఇదే విధంగా సాగాయి రోజులు.

# ★ పిల్లల స్వంత ఖర్చు ★

నాకు, మా తమ్ముడికి ఖర్చులంటూవుండేవి మాయమయ్యాయి. మాలో పిసినారితనం ఎక్కువౌతున్నకొద్దీ, ఇంటిక్రింద చీటికి మాటికి చిల్లరలివ్వడం ఎక్కువైంది. ప్రత్యేకంమాదగ్గరున్నుంచి తీసుకోవాలని లేకపోయినా, అమ్మకి, నాన్నగారికీ అల్లా వచ్చేవి అవసరాలు. పాపం! మళ్లీ ఇచ్చేద్దామనేవున్నా కుదిరేదికాదు. మేము అప్పులాళ్లకు మల్లే దబాయించలేము కదా! సరే. వాళ్లైనా తీర్చాల్సిన బాకీలలిస్టులో మా పేర్లు వేసుకోరుకదా!

ఇల్లా మా క్రింద ఏర్పడింది కాస్తా కుటుంబంఖర్చుక్రింద తయారైంది. ఈ సంగతి మేమిద్దరం ఒకేసారి గ్రహించాము.

ఒక శుభోదయాన, మా నాన్నగారికి చెప్పాం కూడబలుక్కుని.

"నాన్నగారూ, ఇంకనుంచి మాకు డబ్బు వద్దులెండి. మే మడిగినప్పు డివ్వండి కావలసిన డబ్బు" అన్నాను నేను.

"ఏం? పదిరూపాయలు చాలడంలేదా?" అన్నారు నాన్నగారు.

"అసలు ఎక్కువౌతాయి నాన్నగారూ. మే మడిగేవాటిలో అవసర మనుకున్నవే ఇవ్వండి నాన్నగారూ మీరు" అన్నాడు మా తమ్ముడు.

"ఐనా, మాకు వేరే దేనికండీ, వీలునిబట్టి ఎంతైతే అంతే ఖర్చుపెట్టుకుంటాము" అన్నాను నేను.

అమ్మ, నాన్నగారు ఏమనుకున్నారో గాని ఎందుకు వీళ్లిలా అంటున్నారా అని ఆలోచించినట్లు లేదు. కాబట్టే బ్రతికిపోయాం. లేకపోతే మేమిద్దరం కాబూలీ వాళ్ళల్లే కనుపించేవాళ్ళం వాళ్ళకి.

ఆనాటినుంచి, ఈనాటివరకు నాకు, మా తమ్ముడికి డబ్బు అంటే నవ్వొస్తుంది. ఈమధ్యనే మా అమ్మకి చెప్పాను ఈ తమాషా అంతా. ★

# తుది వీడుకోలు

(5 వ పేజీ తరువాయి)

అంతలో మూడవయామం కూడా గడిచిపోయే సమయం ఆసన్నమయింది. అనిరుద్ధాది అర్హతులంతా ఆచార్యదేవుని కనతిదూరంలో నిల్చబడి నిశ్చలంగా ఆ దివ్యస్మిత జ్యోతిపైపే తిలకిస్తున్నారు. సమీపంలో సన్నని వెలుగుతో ప్రవహించే హిరణ్యవతీనది కూడా ప్రవహించడం విరమించి అక్కడే నిలబడి అలాగే స్తంభించిపోయింది. ప్రపంచం అంతా ఒకే మహాప్రశాంత స్వరూపం ధరించింది.

## 3

"ఆనందా!" అని అంతలో ఇంకొక పిలుపు వినబడింది. ఆ పిలుపు వినబడగానే ఆనందుని శరీరంఅంతా ఒక శిరీష పుష్పంలా వికసించింది. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఆచార్యుని శయ్య సమీపించాడు. అనిరుద్ధాది శిష్యులంతా చుట్టూ నిలచుండి ఇక ఏ క్షణంలో మహాపరినిర్వాణం జరగగలదో అని ఎంతో ఆత్రంగా నిరీక్షిస్తున్నారు. ఆకాశంలో తారకలన్నీ ఆ విషయమే గుసగుసలాడుకొంటున్నట్టుగా మెరుస్తున్నాయి.

ఆనందుని దృష్టి తిరిగీ ఇంకొకమారు తారకలవైపు తిరిగింది. అతనికిక మహాపరినిర్వాణసమయ మాసన్నమైనదని స్ఫురించింది. ఆనందుని హృదయంలో స్తంభించిన ధైర్యసాగరం ఒక్కమారుగా విజృంభించి అల్లకల్లోలమై పొంగింది!

అతడిక నిలబడలేక తథాగతదేవుని పాదాలపై వాలిపోయాడు! పసిపాపలా విలపించాడు! అతనికి తిరిగీ ఇంకొక ఆహ్వానం వినిపించింది!

ఆనందుడు ధైర్యం చిక్కబట్టుకొని నిశ్చల దృష్టితో బుద్ధదేవుని చరమోపదేశం వినవలెననే కుతూహలంతో అలాగే నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

"ఆనందా! జన్మించినవారికి మరణం అనుల్లంఘనీయమని నీకనేక మారులుపదేశించాను. ఇప్పుడదే జరుగనున్నది. దీనికై విచారింప నేల! నీ వంటి శ్రద్ధాళువులకు నిర్వాణం కరతలామలకం!"

ఆ ఉపదేశంతో ఆనందుని హృదయం తిరిగి స్థిరపడింది.

అటుపిమ్మట గౌతమబుద్ధుడక్కడ సమావిష్టులయిన భిక్షువులను, కుశీనర జానపదులను, హిరణ్యవతీనదిని సమస్తప్రాణిలోకాన్ని ఎంతో ఆప్యాయంగా చూచాడు. అతని విశాలవిలోచనాలు చుట్టూ నిలిచిన ప్రతి ప్రాణినీ, ప్రతిపదార్థాన్నీ పలకరించి తుది వీడ్కోలర్పిస్తున్నట్టుగా స్ఫురించాయి.

గౌతముడింకొకమారు ఆనందునివైపు చూచి అత్యంతప్రశాంతస్వరంతో నెమ్మదిగా ఇలా ఉపదేశించాడు:

"ఆనందా! సమస్త ప్రాణి లోకానికీ, సర్వవస్తుజాలానికీ వినాశం సహజం! మీరందరు నిత్యజాగరూకులై అనంత నిర్వాణప్రాప్తికై ప్రయత్నించండి!"

అంతలో ఆకాశంలో ఒక సముజ్జ్వల తారక నేలపై రాలింది!

మరి ఒక మహాతారక దేదీప్యమాన ప్రభాజాలంతో ఆకాశానికెగసిపోయింది! ★

# అరుణ వలయం

(9-వ పేజీ తరువాయి)

తలుపు ఎంతకొట్టినా బదులు లేదు.

"కిందికివెళ్ళి ఏదైనా గొడ్డలిలాంటిది కనిపిస్తే తీసుకురా. తలుపు బద్దలు కొట్టేదాం."

గొడ్డలి కనిపించలేదు గాని సుత్తి ఒకటి దొరికింది.

"ఇటు కొత్త లైటువెయ్యండి" అని అతనికి సహాయంగావచ్చిన డిటెక్టివ్ అడిగాడు. పార్ టార్చి వెలిగించాడు. తెల్లటి తలుపు. అంతా తెల్లగానే ఉందిగాని ఒకచోట ఎర్రగా రబ్బరు స్టాంపుతో ముద్రించినట్లు అరుణవలయం మాత్రం ప్రత్యక్షమైంది.

"తలుపు బద్దలుకొట్టు" అని పార్ అరిచాడు.

అయిదు నిమిషాలసేపు తలుపుమీద సుత్తి దెబ్బలుకొట్టి ఒక చిన్న ముక్క విరగొట్టారు. ఆ రంధ్రంలోంచి పార్ లోపలి గడియ తీశాడు. ఇంత గొడవజరిగినా మంచంపై పడుకున్న వ్యక్తికి స్పృహ వచ్చిన సూచన కనబడలేదు. దగ్గిరికి వెళ్ళి చూస్తే అతడు మరణించి ఉన్నాడు. అతని ముఖాన వికృతమైన నవ్వు తాండవిస్తోంది. (ఇంకా ఉంది.)

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



గరుడ ప్రతిమ (బేలూరు)

ఫొటో : వి. గోపాలకృష్ణన్—మద్రాసు.

# ఇప్పుడు రెక్సోనాలో ఏదో క్రొత్త మార్పు ఉన్నది!




*అది...*

*ఎంతో ఎక్కువ...*

*సువాసనైనది!*

రెక్సోనా సబ్బు—
చాలాకాలము నిలవుండే
హాయి కొరకు ఇప్పుడు ఇంకా—
మరీ యెక్కువ
పరిమళమును
గలిగియున్నది!

క్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్, వారి తరఫున భారతదేశంలో తయారుచేయబడినది